# ఒకమాట

ఈ విజయాంధ్ర వ్యాకరణములు ప్రభుత్వమువారు ప్రకటించిన నూతన ప్రణాళిక ననుసరించి వ్రాయఁబడినవి.

ఇందు ముందుగా ఉదాహరణము లిచ్చి విపులముగా వానిని బోధపఱచి పిమ్మట సూత్రములు వ్రాసి మరల మఱికొన్ని యుదాహరణము లీయఁబడినవి.

ఇవి ప్రతి విద్యార్థియుఁ దనంత దాను చదువుకొని యర్థము చేసికొనునంత సులభశైలిలో వ్రాయఁబడినవి.

ప్రతి వ్యాకరణము నందును నా యాధారములకుఁ దగిన శైలిలోఁ బ్రణాళిక ననుసరించి వివిధ వ్యాసములు గూడ వ్రాయఁబడినవి.

క్రొంగ్రొత్త పోకడలు గల యీ వ్యాకరణములు విద్యార్థుల కత్యంతము నుపకరింపఁ గలవు.

ఇట్లు,
వ్యాకర్తలు.

# విషయసూచిక

# విజయాంధ్ర వ్యాకరణము

—— :*: ——

## 1. వర్ణసమామ్నాయము, అచ్చులు, హల్లులు.

### వర్ణసమామ్నాయము, అక్షరసంప్రదాయము.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ం ఁ ః

క ఖ గ ఘ ఙ ౘ చ ఛ ౙ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల ళ వ శ ష స హ.

ఈయేబదియాఱు తెనుఁగునకు అక్షరములు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అను నీపదునాఱు అక్షరములు అచ్చులు.

అనఁగా 'అ' మొదలుకొని 'ఔ' వఱకును గలవి అచ్చులు అని భావము.

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల ళ వ శ ష స హ.

అను నీముప్పదియేడక్షరములు హల్లులు.

'క' మొదలుకొని 'హ' వఱకును గలవి హల్లులని భావము.

ం (సున్న) ఁ (అర్ధసున్న) ః (విసర్గము)
ఈమూడు ఉభయాక్షరములు.
అనఁగా అచ్చులు హల్లులుకూడ నని భావము.

ఋ ౠ ఌ ౡ ః ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ థ ధ ఫ భ శ ష
ఈ 19 అక్షరములు సంస్కృతభాషలోనే యుండును. తెలుగులో లేవు.

ఎ ఒ ఁ ౘ ౙ ఱ ఈ ఆఱక్షరములు తెలుగులోనే కలవు. సంస్కృతములో లేవు.

సంస్కృతపదములు తెలుగుపదములుగల భాషనే మనము తెనుఁగు భాషయని చెప్పుచున్నాము. అనఁగా మనభాష అచ్చతెలుఁగు, సంస్కృత భాషలలోని పదములతోఁ గూడియున్నదని తాత్పర్యము.

## అభ్యాసము

1. తెలుఁగుభాషకు వర్ణము లెన్ని?
2. అందచ్చు లెన్ని? హల్లు లెన్ని?
3. అచ్చులని వేనికిపేరు? హల్లులని వేనికిపేరు?
4. ఉభయాక్షరము లేవి?
5. ఏయక్షరములు సంస్కృతభాషలో లేవు?
   ఏయక్షరములు తెలుఁగులో లేవు?

## 2. కళలు-ద్రుతప్రకృతికములు, వానిని గుర్తించుట.

### కళలు

| | |
|---|---|
| రామునిగూర్చి | రామునికై |
| జ్ఞానముఁబట్టి | జ్ఞానముయొక్క |

చూచుచున్నాము, చూచుచుంటిమి, వెళ్లిరి, వ్రాసితివి, వ్రాసితిరి, వ్రాసి, వ్రాయక, ఔరా, అక్కటా.

పైపదములను చూడుము, దీనిచివర నకారములేదు. నకారము (ద్రుతము) చివరలేని పదములను కళలందురు.

♦ నకారమునకు ద్రుతమని పేరు.

♦ ద్రుతము చివర లేనిపదములు కళలు.

1. విభక్తి ప్రత్యయములలో డు ము వు లు (ప్రథమ) ఓ ఓరి ఓసి ఓయి (సంబోధన ప్రథమ) కూర్చి, గురించి, కై, పట్టి, యొక్క అనునవి కళలు. అనఁగా వీని చివర నకారము (ద్రుతము) లేదు.

2. క్రియాపదములో ఉత్తమపురుషముయొక్కయు భూత, తద్ధర్మార్థక క్రియల, ప్రథమపురుషము యొక్కయు ఏకవచనములు గాక మిగిలినవన్నియు కళలు.

ఉ:-వ్రాయుచున్నాము, వ్రాసిరి, వ్రాసితివి, వ్రాసితిరి.

♦ అసమాపక క్రియలలో 'ఇ' 'ఆక' చివర వచ్చునవియు, ఆశ్చర్యము మున్నగు అర్థములు తెలుపు పదములు అప్పుడు ఇప్పుడు మొదలగునవియు కళలు.

చేసి, చేయక, ఊరక, అయ్యో! ఔరా! ఏమి; ఏల? అంత మొ॥

నేను, వానినిన్, వానిచేన్, వానితోన్, వానికొఱకున్, వాని వలనన్, వ్రాసెను, వ్రాయుచున్, వ్రాసితిని, వానికిన్, వానియందున్, ఇఁకన్, వలెన్, కనుకన్, అంతటన్, పిమ్మటన్, చాలన్, కూడన్, వీనిని చూడుము—వీని చివర నకారము కలదు. నకారమునకు ద్రుతమని పేరు.

- ద్రుతము చివరగల పదములు ద్రుతప్రకృతికములు. (ద్రుతము = కరిఁగిపోవునది.)

- విభక్తి ప్రత్యయములలో ప్రథమావిభక్తి ప్రత్యయములు, సంబోధన ప్రథమావిభక్తి ప్రత్యయములు, కూర్చి, గురించి, కై, పట్టి, యొక్క అనునవితప్ప మిగిలిన నన్, నిన్, లన్, చేతన్, చేన్, తోడన్, తోన్, కొఱకున్, వలనన్, కంటెన్, కిన్, కున్, లోన్, లోపలన్, అందున్, నున్, అనునవి ద్రుతప్రకృతికములు.

- నేను తాను— ఇవి ద్రుతప్రకృతికములు.

- ఉత్తమపురుషైకవచనములును భూత, తద్ధర్మార్థకముల ప్రథమపురుషైకవచనములును ద్రుత ప్రకృతికములు.

భూతకాలము: కనెను, వినెను.

తద్ధర్మకాలము: వ్రాయును, తినెడున్, కనెడిన్.

♦ చున్, కన్, గాన్, డున్, నున్ ఇవి తుదిని వచ్చు పదములు ద్రుతప్రకృతికములు.

ఉ:-తినుచున్, వినుచున్, చేయఁగన్, చేయఁగాన్, నావుడున్, అనవుడున్, అనుడున్, వినినన్, కనినన్.

♦ ఎడు - త - అను ఆశీరర్థక ప్రత్యయములు ద్రుత ప్రకృతికములు.

ఉ:-కాపాడెడున్, కాపాడుతన్.

♦ చాలన్ - మొదలగునవి ద్రుతప్రకృతికములు.

ఉ:-ఇఁకన్, ఇఁగన్, ఎట్టకేలకున్, ఎల్లన్, చాలన్, మీదన్, ఒద్దన్, దాఁకన్, పోలెన్, కనుకన్, వలెన్, ఐనన్, ఈవలన్, తరువాతన్ మొదలగునవి

## అభ్యాసము

1. కళలనేమి?
2. ద్రుతమననేమి?
3. ద్రుతప్రకృతికములని వేనికి పేరు?
4. విభక్తులలోను, క్రియలలోను కళలేవి? ద్రుతప్రకృతికములేవి?
5. స వి చేర్చిన క్రియలు కళలు ఏవిచేరిన క్రియలు ద్రుత ప్రకృతికములు?
6. ఈ క్రింది వాక్యములలోని కళలను, ద్రుతప్రకృతికములను దెలుపుము.

(i) గాంధి చనిపోయి నేఁటికి ఏఁడాది పైఁగా అయ్యెను. (ii) అతని ఆత్మకు శాంతి కలుగుఁగాత అని అందఱును ప్రార్థింపవలెను. (iii) గాంధికంటె దేశభక్తుఁడు లోకములో

లేఁడు. (iv) ఆహా వాని జన్మము ఎంత ధన్యమైనది. (v) నీవు చాల చులుకగా నడచినను నేను నిన్ను కలిసి కొనఁగలను. (vi) వానివలె ఒక్కఁడును తెలివి తేటలు గలవాఁడు లేడు.

---

## 3. వివిధనామవాచకములు.

### సంజ్ఞా, జాతి, సమూహ, భావనామవాచకములు.

1. రాముఁడు మాయ 2 లేడినిగాంచి 3 సేవ లోకయే 4 కోపముతో దానివెంట పరువెత్తెను.

పై వాక్యమును పరికింపుము. ఇందు 'రాముఁడు' అను పదము ఒక ప్రాణినిగూర్చి తెలుపుచున్నది.

ఒక ప్రాణియొక్కగాని, యొక వస్తువుయొక్కగాని, ప్రదేశముయొక్కగాని, పేరునుగూర్చి ప్రత్యేకముగాఁ జెప్పు దానిని సంజ్ఞావాచక (నామ) మందురు.

♦ సంజ్ఞ లేక వచనములందే యుండును.

ఉ :- తిక్కన, భారతము, గోదావరి, హిమాలయము, తణుకు, జర్మనీ మొ॥

2. లేడిని – ఇదియొక జాతినిగూర్చి తెలుపుచున్నది కావున జాతి నామవాచకము.

♦ అందటినిగాని, అన్నిటినిగాని, సమానముగాఁజెప్పు నది జాతినామవాచకము – (దీనినే సామాన్య లేక సాధారణ నామవాచకమందురు.)

అనఁగా ఒకేజాతికి సంబంధించిన వాన్నిటన్నింటికిని సామాన్యముగా ఉపయోగించు పేరులు జాతివాచకములని తెలియునది.

మనుష్యులు, దేవతలు, పక్షులు మృగములు మొ॥
అనఁగా మనుష్యుఁడు - కాకి, పులి, చెట్టు, నది, ఊరు, పల్లె మొ॥

♦ ఒక్కొక్క జాతిని తెలుపునదియు జాతివాచకమె.

ఆఁడువారు, కంది, వరి, రాజులు, సిక్కులు మొ. అనఁగా ఒక్క ప్రాణిని, ఒక్కవస్తువును తెలుపునపుడు ఏకవచనము వాడవచ్చును.

3. సేన - ఇది సమూహవాచకము.

♦ ఒకే జాతికిగాని, ఒకే తెగకుఁగాని, కొన్నిటియొక్క గాని, సమూహమును జెప్పునవి సమూహవాచకములు. (అనగా ఒక్కజాతికిచెందిన అనేక ప్రాణులనుగాని, అనేక వస్తువులనుగాని యొక్కగుంపుగా చెప్పునదని యర్థము.)

ఉ :-గుంపు, సభ, మంద, తోపు, గుత్తి, సేన, బడి మొ.

ఒక జాతికి సంబంధించిన సంఘమును దెలుపుపదము ఏకవచనమైనపుడు జాతివాచకము. బహువచనమై యితరసమూహమును దెలుపునపుడు సమూహ నామవాచకమును అగును. ఎట్లంటిరేని సేన - మంద సమూహ వాచకములైనను సేనలు - మందలు అన్నప్పుడు జాతివాచకము లగును.

4. కోపముతో ఇది భావమును దెలుపుచున్నది. కావున భావవాచకము. (దీనినే గుణవాచకమనియు నందురు.)

♦ భావములను, అవస్థలను, కర్మలను దెలుపునవి భావ నామవాచకములు. (అనగా భావ లేక గుణాదులను తెలుపునది.)

ఉ :-తీపి, చేదు, పులుపు, ఒగరు, బాల్యము, యౌవనము, మంచి-చెడ్డ, తెల్లన, తెలివి, కోపము, ఎత్తు, పొడుగు, వంకర, పెద్దతికము, చెలిమి, వంట, ధైర్యము మొ.

## అభ్యాసము

1. సంజ్ఞానామవాచక మన నేమి ?
2. జాతినామవాచక మన నేమి ?
3. సమూహ నామవాచక మన నేమి ?
4. భావనామవాచక మన నేమి ?
5. ఏ మార్పుచేసిన జాతినామవాచకము సమూహనామవాచకమగును ?
6. ఈ క్రింది పదము లేయే నామవాచకములో వ్రాయుము.

(i) కృష్ణ, ఒగరు, పర్వతము, జయపురము, మంద, రెడ్డులు, మందలు.

(ii) ఈక్రిందివాక్యములో క్రీగీతలుగల పదము లేయే సర్వనామములో తెలుపుము.

సాహసముగల కొంపు మనుష్యసమూహము అక్కడలేకయే పెద్దతికముతో అడవికి వెళ్లి గుత్తుగుత్తులుగా ఉన్న పూలను గాంచి, యానందించి ఆలను మేపి అవి పెసరచేలలో పడి తినకుండ తఱుకునకు త్రోలికొనివచ్చెను.

## 4. వచనము.

## నిత్యైకవచనములు, నిత్య బహువచనములు, కొన్ని వచనరూపములు.

### వచనము.

రాముఁడు వచ్చెను. ఆవులు వచ్చినవి. రామునికిచ్చెను. గేదెలను మేపెను.

పై వాక్యములలో క్రీగీఁతలుగల పదములు కొన్ని యొక్క సంఖ్యను, కొన్ని పెక్కు సంఖ్యలను దెలుపుచున్నవి.

♦ సంఖ్యను దెలుపునది వచనము.

రామకృష్ణుఁడు బడికి వెళ్ళెను. ఇందిర చదువుచున్నది. భీమేశ్వరి పూలు కోయుచున్నది. తెలుగుఁరాజు వ్యాకరణము వ్రాసెను. కన్నె నవ్వుచున్నది.

పై వాక్యములలో క్రీగీఁతలుగల పదము లొక్కొక్క సంఖ్యను మాత్రము తెలుపుచున్నవి.

♦ ఒక్కదానినిగూర్చి చెప్పు (ప్రత్యయము) నది ఏక వచనము.

కవులువ్రాసిన పుస్తకములను బట్టి పండితులు వ్యాకరణములను వ్రాసి వానిలో బహువిధములైన కట్టుబాటులు కావింతురు.

ఈ పైవాక్యములో క్రీగీఁతలుగల పదములన్నియు నొకటికంటె నెక్కువ సంఖ్యను అనఁగా పెక్కుసంఖ్యలను దెలుపుచున్నవి.

♦ పెక్కింటినిగూర్చి చెప్పు ప్రత్యయము బహువచనము.

♦ సాధారణముగా ప్రథమైకవచన రూపములకు 'లు' వర్ణము చేర్చుటచే బహువచన రూపమేర్పడును.

కొన్ని బహువచన రూపములు.

బాలురు అడవికేఁగు వేఁటకాండ్రను గాంచి నవ్వఁగా వేఁటకాఁడు వారిని బెదరించుటకై కొలఁకులలోని తామరాకుఁ గాడలకు మీలను గ్రుచ్చి మీసలు త్రిప్పి గుండ్లు విసరి, బంట్లవలె ఱాళ్ళు విసరుచు ఊరులు దాఁటిపోయిరి.

పై వాక్యములోని గీఁతలుగల వాక్యమును పరికింపుము. అవి యన్ని పెక్కుసంఖ్యలను దెలుపుచున్నవి. బహువచన ప్రత్యయమైన 'లు' ప్రత్యయమునకు బదులైన రు ండ్రు ఉఁ కు అను ప్రత్యయము దాల్చినవి కొన్నియు, ప్రథమైకవచనప్రత్యయము లోపించినవి కొన్నియు డ-ల-లు - ర - ల లోని ఉకారము లోపించినవి కొన్నియు, (డ్లు-ట్లు) ళకారము వచ్చినవి కొన్నియు కనఁబడుచున్నవి. (ళ్ళు) ఇవి యన్నియు పెక్కింటిని తెలుపుచున్నవి. కావున బహువచన ప్రత్యయములు.

♦ కొన్ని శబ్దములకు 'ట' కు బదులు 'రు' వచ్చును.

ఉ :-పగతుఁడు - పగతురు, వాఁడు - వారు.

♦ కొన్నియెడల 'ట' కు బదులు 'ండ్రు' వచ్చును.

ఉ :-కోడలు - కోడండ్రు, చెల్లెండ్రు.

♦ కొన్నిచోట్ల 'ట' కు బదులు 'ంద్రు' గాని, 'ఉు' గాని వచ్చును.

ఉ:- విలుకాఁడు - విలుకాఱు.

♦ కాలను మొదలైన శబ్దముల చివరగల 'ను' కు బహువచనము పరమగుచో 'ఁకు' నిత్యముగా వచ్చును. ఏకవచనము 'ఁకు' వికల్పముగా వచ్చును.

ఉ:- మ్రాను, మ్రాకు, మ్రాకులు, కాలను, కాలఁకు, కాలఁకులు.

♦ 'రేను' మొదలైన శబ్దముల 'ను' కు బహువచనమున నిత్యముగాను, ఏకవచనమున వికల్పముగను 'ఁగు' అగును.

ఉ:- గోను, గోఁగు, గోఁగులు; రేను, రేఁగు, రేఁగులు.

♦ బహువచనము పరమగునపుడు 'ఆవు' మొదలగు శబ్దముల చివర వర్ణము వికల్పముగా లోపించును.

ఉ:- ఆవు-ఆలు, ఆవులు. చుట్టము, చుట్టలు, చుట్టములు (చుట్టాలు)

♦ బహువచనము పరమగునపుడు 'డ ల ట ర' ల ఉకారమునకు లోపము బహుళము.

ఉ:- గుండు, గుండులు, గుండ్లు. బంటు, బంటులు, బంట్లు. గోరు, గోరులు, గోర్లు.

గుండ్లు, గోర్లు - అనునవి ఉకార లోపము రాఁగా ఏర్పడినవి. బహుళ గ్రహణముచేతనే పులులు, పిల్లులు, మొదలగుచోట్ల లోపము లేదు. కోట్లు, పిప్పళ్ళు మొదలగు తత్సమ పదములలోఁగూడ లోపము కనఁబడుచున్నది.

♦ బహువచనము పరమయినప్పుడు శబ్దములచివరఁ గల డ-ల-ర వర్ణములకు బదులుగా ళ కారము బహుళముగా వచ్చును. ఇందలి డలు - లులు - రులు - లకు బదులుగా ళ్ళు కూడ వచ్చును.

ఉ:- త్రాడు, త్రాడులు, త్రాళులు, త్రాళ్ళు. గోరు, గోరులు, గోళులు, గోళ్ళు. అంబలి, అంబలులు, అంబళులు, అంబళ్ళు.

## నిత్యైకవచనములు.

1. వరి పండు నేలలో కందిగాని, పెసరగాని, సెనగగాని, జొన్నగాని పండింపరు. వరికోసినతరువాత నవి రెండవపంటగా పండింతురు.

పైవాక్యములో గ్రీగీఁతలుగల పదములు ఎల్లప్పుడు ఒకే సంఖ్యను దెలుపు గాని పెక్కింటిని దెలుపవు. కావున ఇవి నిత్యైకవచనములు.

2. లోహములలో బంగారము శ్రేష్ఠమైనదియైనను దానిని నేయి, ఉప్పు, పసుపు, చింతపండు మొదలగునవి వాడుకచేయు పాత్రల కుపయోగింపరు. వెట్టివెంకయ్యయైనను పచ్చని బంగారమును సాటిలేని శృంగారములైన నగలకే యుపయోగించునుగాని, ఎవ్వడును ఎక్కడను కేలను, (చేయి) దాల్చు మురుగును మొలకుఁదాల్చునట్లు ఇతరములైన పనుల కుపయోగింపఁడు.

పై వాక్యమును పరికింపుము. అవియన్నియు యెల్లప్పుడును ఒకే సంఖ్యను దెలుపుచుండును గాని పెక్కింటిని దెలుపవు. కావున నిత్యైక వచనములు.

◆ నిత్యైకవచనము లనఁగా ఎల్లప్పుడు ఏకవచన మందే యుండునవి.

1. సస్య (పైరు) వాచకములు: వరి, కంది, ఆరుగ, ప్రత్తి, మొ.
2. లోహవాచకములు : ఇనుము, కంచు, సత్తు, వెండి, మొ.
3. సంభారవాచకములు: నూనె, నేయి, చమురు, ఉప్పు, ఇంగువ, పసుపు మొ. (ఆవాలు, ధనియాలు. మెంతులు-ఇవి నిత్య బహువచనములు.)
4. ధాన్యవాచకములు: బియ్యము, జీలకఱ్ఱ మొ.
5. గుణవాచక విశేషణములు : నలుపు, తెలుపు మొ.
   ఉ :-కాకులు నలుపు, హంసలు తెలుపు.
6. సామ్య (సమాన) వాచకములు: సరి, సాటి, ఈడు, ఉద్ది మొ.
   ఉ :-సీతారాములతో నెవరు సాటి
7. సంజ్ఞానామవాచకములు : నెల్లూరు, యమున, శ్రీశైలము, తాజ్ మహల్ మొ.
8. కేలు, ఇరులు (చీఁకట్లు) అప్పుడు, అక్కడ, అచ్చట మొ.
   ఇవియన్నియు నిత్యైకవచనములు.

## నిత్యబహువచనములు.

పిల్లలు అందలు డాఁగురు మూఁతలు ఆడియాడి గుడిగుడు గుంచాలు ఆడి వేఁచిన సెనగలు తిని కురులు సవరించుకొని కూర్చుండిరి.

పైవాక్యములో క్రీగీతలుగల పదములన్నియు పెక్కింటిని తెలుపుచున్నవి. అవి నిత్యముగా పెక్కింటిని తెలుపునవి కావున నిత్యబహువచనములు.

♦ ఎప్పుడును బహువచనములుగా నుండునవి. నిత్య బహు వచనములు.

♦ క్రీడావిశేషవాచకములును, పెక్కు ధాన్యవాచకములును నిత్యబహువచనాంతములు.

క్రీడావిశేషములు = ఒకమాదిరి ఆటలు.

ఉ :-అమ్మనబంతులు, గొబ్బిళ్ళు, ఓమనగుంటలు, గచ్చకాయలు, మొ. ధాన్యవాచకములు : వడ్లు, పెసలు, మినుములు, ఆళ్ళు, చోళ్ళు, రాగులు మొ.

అందలు, ఇందలు, కొందలు, పెక్కండ్రు-పెక్కురు, గుగ్గిళ్ళు, అక్షతలు, అగచాట్లు, పేలాలు మొ.

## అభ్యాసము

1. వచనమనఁగా ఏది? అదెన్ని విధములు? అవేవి?
2. తఱచుగా బహువచన మెట్లు ఏర్పడును? బహువచన 'లు' కు బదులుగా విశేషముగావచ్చు ప్రత్యయములేవి?
3. నిత్యైకవచనములన నేమి? నిత్యబహువచనములన నేమి?
4. ఈక్రింది ఏకవచనములకు బహువచనములును, బహువచనముల కేకవచనములును వ్రాయుము.

నృపాలుఁడు వేటకాలు చూడరాఁగా, నెయ్యుఁడొక్కఁడును లేకయే ఊరి వెలుపలి కొలను దాఁటి, ఆవు శకునముకాగా, గోఁగులపూవులను గాంచి, త్రాడుతంకరలతో అడవిఁకేగెను.

5. ఈ క్రిందివానిలోని నిత్యైకవచన, నిత్యబహువచన పదములను సహేతుకముగా తెలుపుము.

ఓమనగుంటలు, గుగ్గిళ్లు, వెన్న - ఈడు, జీలకఱ్ఱ, - ఎక్కడ, నెయ్యి - నలుపు - ఇత్తడి.

## 5. లింగము

### మహద్వాచక, మహతీవాచక రూపములు.

### లింగము.

సీతారాములు ఘోరారణ్యములకు చని చెట్టు పుట్ట తిరిగి చిలుకల పలుకులు, ఆవుల అంబారవములు వినిరి.

పై వాక్యములో క్రీగీతలుగల పదములను పరికింపుము.

ఇందు స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగ శబ్దములు గలవు.

లింగమునకే వాచకమని పేరు.

సీత=స్త్రీలింగము, మహతీవాచకము, రాముఁడు పుంలింగము, మహద్వాచకము. చెట్టు, పుట్ట, చిలుక, ఆవు అమహద్వాచకములు, నపుంసకలింగములు.

♦ స్త్రీ పురుష జడవాచకమునకే లింగమని పేరు.

శబ్దములు మహద్వాచకములు, (పుంలింగములు) అమహద్వాచకములు, (నపుంసకలింగములు) మహతీ వాచకములు (స్త్రీలింగములు) మహన్మతీవాచకములు – అని విభజింపవచ్చును.

## మహద్వాచకము.

రాముడు, సుగుణాభిరాముడు, ఇందు మొదటిది విశేష్యము (నామవాచకము) రెండవది విశేషణము. ఈరెండును ఒక పురుషుని గూర్చియు వాని గుణములనుగూర్చియు తెలుపుచున్నవి. కావున పుంలింగములు (మహద్వాచకములు)

♦ పురుషులను తెలియఁజేయు శబ్దములును, వాని విశేషణములును మహద్వాచకములు.

ఉ :–భీముఁడు, గరుత్మంతుఁడు మొ.

## మహతీవాచకములు.

సరస్వతి చాల విద్యావతి. లక్ష్మిధనవంతురాలు. పార్వతి పుణ్యాత్మురాలు. ఈవాక్యములలోని క్రిందగీటులుగల పదములు స్త్రీనిగూర్చి తెలుపుచున్నవి కావున (మహతీవాచకములు) స్త్రీలింగములు.

♦ స్త్రీలను మాత్రము తెలుపుపదములు మహతీవాచకములు.

ఉ :–వినత, తార, మండోదరి, అమ్మ, అక్క, మొ.

♦ సంస్కృతములో లింగము శబ్దము నాశ్రయించి యుండును. గాని తఱచుగా అర్థము నాశ్రయించి యుండదు.

♦ తెలుఁగున లింగనిర్ణయమునకు అర్థమే గతి.

సంస్కృతములో దారాః పుంలింగము. భార్య యని యర్థము. తెలుఁగులో ఇది మహతీవాచకము, స్త్రీలింగము-కళత్రం. ఇది సంస్కృతములో నపుంసకలింగము - తెలుఁగులో మహతీవాచకము.

నదీ-లతా (నది లత) ఇవి సంస్కృతములో స్త్రీలింగములు. తెలుఁగులో అమహద్వాచకములు.

(లింగజ్ఞానమునకు విభక్తిప్రత్యయములు సంస్కృతములోవలె తెలుగుఁలో తోడ్పడవు.)

## అభ్యాసము

1. వాచక మన నేమి ?
2. వాచకము లెన్ని ? అవి యేవి ?
3. మహద్వాచకము లన నేమి ?
4. మహతీవాచకము లేవి ?
5. ఈ క్రింది వాక్యములోని పదము లేవి మహద్వాచకములో యేవి మహతీవాచకములో సకారణముగా తెలుపుము.

గుణవంతుడైన రాముఁడు, తల్లికి మ్రొక్కి సీతను, లక్ష్మణుని వెంటఁగొని అడవుల కేఁగెను.

దేవుఁడు-దేవి, రాజు-రాణి, బాలకుఁడు-బాలిక.

పై వానిని చూడుము. కొన్ని మహద్వాచకములకు చివర యించుక మార్పు చేయఁగా మహతీవాచకము లైనవి.

ఇట్లే జనకుఁడు - జనని, నాయకుఁడు - నాయిక మొ.

పురుషుడు—స్త్రీ

తండ్రి　　తల్లి

వరుఁడు　　వధువు

మగవాఁడు　ఆఁడుది.

పైవానిని చూడుము. మహతీవాచకములు మహద్వాచకములకంటె వేఱుతీరుగా నున్నవి.

ఇట్లే పిత - మాత, భ్రాత - స్వస.

1. ఈ క్రింది పదములలోని మహద్వాచకములకు మహతీ వాచకములను, మహతీవాచకములకు మహద్వాచకములను వ్రాయుము?

జనకుఁడు, దేవేరి, విద్దు, కూఁతురు.

## 6. విభక్తులు సింహావలోకనము.

రాముఁడు సీతనుగాంచి, యాప్రేమతో సీతా! నీచే ఈయఁబడిన మధురఫలములు దేవుని కొఱకు అర్పింపఁదలఁచితి. ఈ ఫలముల వలన భగవంతునియొక్క పూజ పూర్తియగునని నా మనస్సునందు అభిలాష పొడము (కలుగు) చున్నది. ఏమందువు ఓ సీతా!

పైవాక్యములో క్రింద గీతలుగల ప్రత్యయములను చూడుము. అవి పదమునకు పదమునకుఁ గల పరస్పర సంబంధమును తెలియజేయుచున్నవి.

♦ పదములకుగల పరస్పర సంబంధము తెలుపునది విభక్తి.

ఒక పదమును, మఱియొక పదమును కలియునప్పుడు సంబంధ ముండును. అట్టి సంబంధమును తెలియఁజేయునదే విభక్తి. చూడు, రాముఁడు సీతను గాంచి, ఇందు 'ఁడు' రామునకును - సీతకును గల సంబంధమును - ను సీతకును కాంచి అనుదానికి గల సంబంధమును తెలుపుచున్నవి. ఇవి వరుసగా ప్రథమ, ద్వితీయావిభక్తి ప్రత్యయములు. ఇట్లే మిగిలిన విభక్తిప్రత్యయముల క్రింద గీఁతలుంచఁబడినవి చూడుము.

1. ప్రథమావిభక్తి
2. ద్వితీయావిభక్తి
3. తృతీయావిభక్తి
4. చతుర్థీవిభక్తి
5. పంచమీవిభక్తి
6. షష్ఠీవిభక్తి
7. సప్తమీవిభక్తి

   ఈ యేడును విభక్తులు.

8. సంబోధన ప్రథమావిభక్తి కూడకలిసిన తెలుఁగునకు విభక్తులు ఎనిమిది.

♦ పదమునకు పదమునకుఁ గల సంబంధమును దెలుపుటకు ఆ పదముల చివర వచ్చువానికి ప్రత్యయములని పేరు.

| | | |
|---|---|---|
| 1. ఁడు, ము, వు, లు | ప్రథమావిభక్తి | ప్రత్యయములు |
| 2. నిన్, నున్, లన్, గూర్చి, గుఱించి | ద్వితీయా | ,, |
| 3. చేతన్, చేన్, తోడన్, తో | తృతీయా | ,, |

4. కొఱకున్, కై, చతుర్థీవిభక్తి ప్రత్యయములు
5. వలనన్, కంటెన్, పట్టి పంచమీ ,,
6. కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్ షష్ఠీ ,,
7. అందున్, నన్ సప్తమీ ,,
8. ఆ, ఆర సంబోధనప్రథమా ,,

రాముఁడు, ధనము, ఆవు, రామా! తల్లిని వనమునన్.

పై పదములన్నియు ఒక్కొక సంఖ్యనే తెలుపుచున్నవి. కాన అవి యేకవచనములు.

♦ ఁడు, ము, వు, ఆ, నిన్, కున్, ఈ ప్రత్యయములు ఏకవచనమునందు మాత్రమే వచ్చును.

రాములు, రాములారా, ధనములు, ఆవులు, ధనములన్, ఈ పదములు పెక్కు (ఒకటికంటె నెక్కువ) అను అర్థమును దెలుపుచున్నవి. కావున బహువచనములు.

♦ లు - ఆర - లన్, ఇవి బహువచన ప్రత్యయములు.

సీతను గాంచి వనమున ఉన్న రాముఁడు అన్యవనములకు అచ్చట చెంచుబాలికలతో అడవి నెమళులకై ఆటలు నేర్పఁడని హెచ్చరించితి మేని, మన మాటలవలన వారు సంతోషముగాంచి మనయొక్క తిండికి చెలువునందున్న, యడవులయందున్న నీరములను పండులను తీసికొని రాఁగలరు.

ఈ వాక్యములలో క్రిందగీఁతలుకల ప్రత్యయములు ఏకవచనమునందును, బహువచనమునందునుగూడ వాడఁబడినవని గ్రహింపవచ్చును. కావున 'ఁడు' ము, వు, ఆ, కున్, అనునవి ఏకవచనమునందును, లు,

ఆర, లన్, అనునవి బహువచనమునందును, మిగిలిన ప్రత్యయములన్నియు ఏకవచనమునందును బహువచనమునందును వచ్చునని యెఱుంగునది.

నున్, కూర్చి, గుఱించి, చేతన్, చేన్, తోడన్, తోన్, కొఱకున్, కై, వలనన్, కంటెన్, పట్టి, కున్, యొక్క, లోన్, లోపలన్, అందున్ ఇవి రెండు వచనములందును వచ్చు ప్రత్యయములని తాత్పర్యము.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | రాముఁడు . | రాములు |
| సం. ప్ర. | ఓయి రాముఁడ, ఓ రాముఁడ రామ, రామా ! | ఓ రాములార రాములారా ! |
| ద్వి. | రాముని, రామున్ | రాములను, రాములన్ |
| తృ. | రాముని చేతన్, రాముని చే | రాముల చేతన్, రాముల చేన్ |
| చ. | రామునికొఱకున్, రాముకొఱకున్, రామునికై, రాముకై | రాములకొఱకున్ రాములకై |
| పం. | రామునివలనన్ | రాములవలనన్ |
| | రామునికంటెన్ | రాములకంటెన్ |
| | రాముకంటెన్ | |
| ష. | రామునికిన్, రామునకున్ | రాములకున్ |
| | రాముని యొక్క, రాము యొక్క | రాముల యొక్క |

♦ ఇది అకారాంత శబ్దము.

ఇట్లే కృష్ణ, గోవింద, సుందరాది శబ్దములు.

| | | |
|---|---|---|
| ప్ర. | హరి | హరులు |
| సం. ప్ర. | ఓ హరి ! ఓ హరీ ! | ఓ హరులారా ! |
| ద్వి. | హరిని | హరులను |
| తృ. | హరిచేతన్, హరిచేన్ | హరులచేతన్, |
| | హరియందు, | హరులచేన్. |

♦ ఇది ఇకారాంత శబ్దము.

ఇట్లే కవి, గిరి, ముని, నది, సిరి.

| | | |
|---|---|---|
| ప్ర. | గురువు - గురుఁడు | గురువులు - గురులు |
| సం. | ఓ గురువ! గురుఁడ! గురూ! | ఓ గురువులార! గురులారా! |
| ద్వి. | గురువును గురుని | గురువులను గురులను |
| తృ. | గురువుచేతన్ గురునితోడన్ | గురువులచేతన్ గురువులతోడన్ |
| స. | గురువునందు గురునియందు గురునందు | గురువులయందు గురువులయందు గురులందు |

♦ ఇది ఉకారాంతశబ్దము.

ఇట్లే శంభు, విష్ణు, విభు, ప్రభు మొదలగునవి.

| | | |
|---|---|---|
| ప్ర. | విధాత విధాతృఁడు | విధాతలు |
| సం. | ఓ విధాత | ఓ విధాతృఁడ |
| ద్వి. | విధాతను విధాతృని | విధాతలను |
| తృ. | విధాతచేత విధాతృనిచేత | |

♦ ఇది ఋకారాంత శబ్దము.

ఇట్లే సవితృ, నేతృ, ధాతృశబ్దములు.

| | | |
|---|---|---|
| ప్ర. | సీత | సీతలు |
| సం. | ఓ సీతా! | ఓ సీతలారా! |
| ద్వి. | సీతను | సీతలను |
| తృ. | సీతచేతన్ | సీతలచేతన్ |
| స. | సీతయందు | సీతలందు సీతలయందు |

ఇది అకారాంత స్త్రీలింగ సీతాశబ్దము. తెలుఁగున సీత.

ఇట్లే అకారము చివరఁగల మూఁడు లింగముల తత్సమ ఆచ్ఛిక శబ్దములకు చెప్పవచ్చును.

ఉ:-పిత, బ్రహ్మ, కాంత, లత, కర్మ, అన్న, అమ్మ, మగువ, కోట మొ.

| | |
|---|---|
| ప్ర. జలము | జలములు |
| సం. జలములన్ | జలములందు |

ఇట్లే ధనము, జ్ఞానము, అద్దము మొ.

| | |
|---|---|
| ప్ర. కొలువు | కొలుఁవులు |
| తృ. కొలువుచే | కొలుఁవులచే |
| స. కొలుఁవునన్ | కొలువునందు |

ఇది ఉకారాంత శబ్దము.

ఇట్లే చెఱువు, బరువు, ముక్కు మొ.

| | |
|---|---|
| ప్ర. కన్నె | కన్నెలు |
| సం. ఓ కన్నె! | ఓ కన్నెలారా! |
| తృ. కన్నెచే | కన్నెలచే |
| స. కన్నెయందు | కన్నెలయందు |

ఇది ఎకారాంత శబ్దము.

ఇట్లే వన్నె, కోడె, పెట్టె మొ.

| | |
|---|---|
| ప్ర. వధువు | వధువులు |
| సం. ఓ వధువ! | వధువులారా! |

తృ. వధువుచే వధువులచే
స. వధువునందు వధువులందు

* ఇది ఊకారాంత శబ్దము.

## అభ్యాసము

1. విభక్తి అనఁగా నేమి? విభక్తులెన్ని?
2. ప్రత్యయమనగా నేమి? ఏవిభక్తికి ఏప్రత్యయములు గలవు?
3. ఏప్రత్యయము లేయేవచనములందు వచ్చును?
4. ఈ క్రిందివి ఏవిభక్తి ప్రత్యయములు?
   కిన్, కున్, కై, కూర్చి, చేన్.
5. జ్ఞానమునన్, కవికిన్, వధువు, కాంత, విధాతచే ఇవి యే అంతశబ్దములో తెల్పుము?
6. ఁడు – ము – వు ఇవి యేయే అంతశబ్దములకురావు?
7. ఈ క్రింది శబ్దములలోని దోషములను సవరింపుము.

రామువుచేత, విధాతునికొఱకు, సీతకి, కొలువుయందు అన్నఁడు.

---

## 7. సర్వనామములు.

### పురుష, ప్రశ్నవాచక, సంబంధనిర్దేశక, సంఖ్యావాచకములు

### సర్వనామము.

రాముఁడు గొప్ప విలుకాఁడు – అతఁడు పితృభక్తి కలవాఁడు.

పై వాక్యములో అతఁడు అను పదము, రాముఁడు అను నామవాచకమునకు బదులుగా వాడఁబడినది. కావున – సర్వనామము.

♦ నామవాచకమునకు బదులుగా వాడఁబడు శబ్దములు సర్వనామములు.

## పురుష సర్వనామము.

1. ప్రథమ పురుషము
2. మధ్యమ పురుషము
3. ఉత్తమ పురుషము

## ప్రథమ పురుష.

వాఁడును - ఆమెయుఁ గలిసి వెళ్ళుచుండఁగా వారు అదియేమి? అవి యేమిటి? అని ప్రశ్నించుకొనిరి.

పై వాక్యములో క్రింద గీఁతలుగల పదములు ప్రథమపురుష - ఏకవచన బహువచన సర్వనామములు.

## మధ్యమపురుష - ఉత్తమపురుషలు.

రామా! నేను బజారువెంబడి వెళ్ళుచుండగా మా యన్న కనిపించెను. మేము అక్కడనుండి వచ్చుచుండఁగా నీవు మీయన్న యెదురైతిరి. మీరున్న యింటికి రానక్కఱ లేకపోయెను.

పై వాక్యములో క్రింద గీఁతలుగల పదములలో మొదటి రెండు వరుసగా ఉత్తమపురుష సర్వనామముయొక్క ఏకవచన బహువచనములు. మిగిలిన రెండు వరుసగా మధ్యమపురుష సర్వనామముయొక్క ఏకవచన బహువచనములు.

పైన చూపిన వాక్యములలోని మూఁడు పురుషములు, సర్వనామములు ఈ క్రింది రీతిని గుర్తించుకొనుము.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ఉ. | నేను | మేము, నేము |
| | ఏను | ఏము |
| మ. | నీవు | మీరు, మీరలు |
| | ఈవు | ఈరు, ఈరలు |
| ప్ర. | వాఁడు అతఁడు | వారు |
| మహతి: | ఆమె అది | వారు |
| అమహతి: | అది | అవి |

అనఁగా పైన జూపిన సర్వనామములు వరుసగా ఉత్తమ, మధ్యమ, ప్రథమపురుష సర్వనామములకు కర్తలగునని తాత్పర్యము.

## ప్రశ్నవాచక సర్వనామము.

ఎవ్వఁడవోయి, ఎవ్వతె వీవు, ఏది తెచ్చినది? ఎందఱు వచ్చిరి? ఏయూళ్ళు చూచితిరి? ఎన్ని పొలములు త్రొక్కితిరి? ఎంత ధనమున్నది?

ఈ పై వాక్యములలోని సర్వనామములన్నియు ప్రశ్నార్థకమును తెలుపుచున్నవి. కావున ఇవి ప్రశ్నవాచక సర్వనామములు.

♦ ప్రశ్నించుటయందుపయోగింపఁబడు సర్వనామములు ప్రశ్నార్థక సర్వనామములు.

ఎవడు -అనుదానికి బదులు గౌరవార్థమున 'ఎవరు' వాడుదురు.

ఉ :- అతఁడెవరు? నీవెవరు?

## సంబంధ సర్వనామవాచకము.

ఎవఁడు గజరాజును గాచెనో ఆహరి నన్ను రక్షించుఁగాక.
ఎవతె రాముని మనసార పూజింపనెంచెనో ఆమె శబరి.
ఏది అందమును గూర్చునో అదే అలంకారము.
ఎందఱు బడికి వచ్చిరో అందఱు చదివిరి.

ఈ వాక్యములలో గీఁతలు గల సర్వనామములన్నియు ప్రత్యేకముగా ఒకే వ్యక్తిని బోధించుచున్నవి. కావున నివి సంబంధ సర్వనామములు.

♦ ఏ - ఆ యను శబ్దములు నిత్యసంబంధము గలవియై యొకేవ్యక్తిని బోధించుచుండును. ఇట్టి నిత్యసంబంధముగల సర్వనామములు సంబంధసర్వనామములు.

ఎవఁడు, ఎవతె, ఏది వీని బహువచనములును, ఎందఱు, ఎంత, ఎన్ని, ఎవరు అనునవియు సంబంధ సర్వనామములు.

## నిర్దేశక సర్వనామము.

వాఁడు శ్రీరాముఁడు. అతఁడు లక్ష్మణుఁడు. ఇతఁడు భరతుఁడు. వీఁడు ఇంద్రుఁడు. ఆమె సీత. ఈమె ఊర్మిళ. వీరు సీతారాములు. అది హిమవంతము. ఇది వింధ్యము.

పై వానిలో క్రింది గీఁతలుగల పదములన్నియు ఒక్కొక్క ప్రాణిని (వ్యక్తిని) వస్తువును నిర్దేశించుచున్నవి. కావున నిర్దేశక సర్వనామములు.

ఇవి ఆ, ఈ లనుండి పుట్టినవి.

వాఁడు, అతఁడు, వీఁడు, ఇతఁడు, ఆమె, ఈమె, అది, ఇది అను నవియు వీని బహువచనరూపములు, వీని రూపాంతరములును నిర్దేశక సర్వనామములు.

♦ ఒక ప్రాణినిగాని, ఒక వస్తువునుగాని, నిర్దేశించి (కనపఱచుటకు) చెప్పునది నిర్దేశక సర్వనామము.

ఉ :- వాఁడు వచ్చెను - వీఁడు తెచ్చెను. ఈ వాక్యములలోని వాఁడు వీఁడు పదములు క్రమముగా విషయమునకు సంబంధించిన దూరముననున్న వానిని, దగ్గఱ నున్నవానిని నిర్దేశించి చెప్పుచున్నవి. ఇట్లే తక్కినవికూడ ఊహించుకొనునది.

## సంఖ్యావాచక సర్వనామము.

1. మా నాన్నగారైదు దానిమ్మపండ్లు తెచ్చి రెండు నాకు మూఁడు మా యన్నకు ఇచ్చిరి.
2. ఈ పరీక్షలో పదుగురు పాల్గొనిరి అయిదుగురు నెగ్గిరి.

పై వాక్యములలో ఒకటవ ఉదాహరణములో 'రెండు' 'మూఁడు' అనునవి రెండు పండ్లు, మూఁడు పండ్లు అనువానికి బదులుగా వాడఁబడినవి. కావున ఇవి సంఖ్యావాచక సర్వనామములు. ఇవి అమహద్వాచకమునకు బదులుగా వాడఁబడుటచే కేవల సంఖ్యావాచకములు.

2 లో పదుగురు - అయిదుగురు అనునవి పదుగురుబాలురు, అయిదుగురు బాలురు, అనువానికి బదులుగా వాడఁబడినవి. కావున ఇవి సంఖ్యావాచక సర్వనామములు. ఇవి 'బాలురు' అను అమహద్వాచకమునకు బదులుగా వాడఁబడుటచే సంఖ్యేయ వాచకములయ్యెను.

- సంఖ్యావాచక సర్వనామములు, కేవల సంఖ్యావాచకములు, సంఖ్యేయ వాచకములు అని రెండు విధములు.
- అమహద్వాచకములకు బదులుగా వాడఁబడు సంఖ్యావాచకములు కేవల సంఖ్యావాచకములు.
- మహద్వాచకములకును, మహతీ వాచకములకును బదులుగా నుపయోగింపబడు సంఖ్యావాచకములు సంఖ్యేయవాచకములు. ఇవి సాధారణముగా సంఖ్యావాచకమునకు 'గురు' అనుదానిని చేర్చుటవలన ఏర్పడును.
- [సంఖ్యావాచకములకు తరువాత నామవాచకము లున్నచో అవి సంఖ్యావిశేషణము లనియు, నామవాచకములు తరువాత లేనివి సంఖ్యావాచక సర్వనామములు.]

| సంఖ్యావాచకము. | సంఖ్యేయవాచకము. |
|---|---|
| ఒకటి | ఒకఁడు, ఒకతె |
| ఒక్కటి | ఒక్కఁడు, ఒక్కతె |
| రెండు | ఇద్దఱు |
| ఎనిమిది | ఎనమండ్రు |
| పది | పదుగురు |
| ఇరువది | ఇరువండ్రు |

ఇట్లే నూఱువఱకు తక్కినవి గ్రహింపుము.

## అభ్యాసము

1. సర్వనామము లనగా నేమి?
2. ప్రథమ - ఉత్తమపురుష సర్వనామములు తెలుపుము?
3. ప్రశ్నవాచక సంబంధ నిర్దేశక సర్వనామముల కొక్కొక్క ఉదాహరణము తెలుపుము.
4. సంఖ్యావాచక మన నేమి?
5. సంఖ్యేయవాచక మన నేమి?
6. ఈ క్రింది పదములు ఏ సర్వనామములో తెలుపుము.
   ఈమె, ఎవతె, ఆహార, రెండు.
7. ఈ క్రింది వాక్యములలోని సర్వనామములు కనుఁగొని, అవి యేయే తెగకు చెందినవో తెలుపుము.
   i. ఆమె మా యింటి కేలవచ్చెను?
   ii. మా యింటికి వచ్చినవాఁడు అతఁడేకదా! మా మేడలో ఐదుగురు ఉన్నారు. మా నాన్న నాల్గు పండ్లు తెచ్చి రెండు నా కిచ్చెను. సభలో ఎనమండ్రు కవులున్నారు.
8. ఈ క్రింది వాక్యములలో గీఁతలుగల స్థలములను సర్వనామములచే పూర్తిచేయుము.
   i. రామా నీవు — చేయుచున్నావు?
   ii. ఎల్లుండి—మా యింటికి వత్తురా?
   iii. — పేరు — ?
   iv. రామారావు — — రోజులలో చెన్నపురికి వెళ్లుచున్నాడు.
   v. గాంధిని — కొట్టిరి?
   vi. ఈ క్రింది వాక్యములలోని సర్వనామములను గూడ జాతి భేదముతో తెలుపుము.
   తణుకులోని పండిత రాజు వీధిలో ఏఁబది యిండ్లున్నవి.

vii. ఆవులలో ఏవి ఎవరివో యెరుగుదువా? ఇవి మావి-అవి మీవి.
viii. నీవు దేనిని కోరిన దానినే ఇచ్చెదను.
ix. ఎవ్వరు వచ్చిరి? ఎంత యిచ్చిరి? ఏది యడిగినారు? ఏమి చెప్పినావు?

---



## 8. విశేషణములు.

గుణవాచకములు, సంఖ్యావాచకములు, క్రియావాచకములు, కొన్ని విశేష్యములను విశేషణములుగా వాడుట.

### విశేషణములు.

నల్లని ఆవు, వాఁడి కత్తి, చురుకు చూపు.

ఇందలి నల్లని - వాఁడి - చురుకు అనునవి ఆవు, కత్తి, చూపుల యొక్క గుణములను తెలుపుచు ఆ గుణములను పెంపొందించు చున్నవి. కావున విశేషణములు.

♦ నామవాచకములయు, వ్యాపారములయు, గుణము మొదలగునవి తెలుపుచు, వాని యర్థమును విస్తరించు పదములను విశేషణములందురు.

### గుణవాచక విశేషణములు.

తెల్లగిత్త - నల్ల గుఱ్ఱము. ఇచ్చట గిత్తయొక్కయు, గుఱ్ఱము యొక్కయు గుణములను చెప్పుటచే తెల్ల నల్ల అనునవి గుణవాకములు.

♦ నామవాచకముల గుణములను చెప్పునవి గుణవాచకములు.

ఉ :-మంచి బాలుఁడు, వాలుమాపు, నెఱికురులుఁ (చక్కని జుట్టు)

## సంఖ్యావాచక విశేషణములు.

వాఁడు మూఁడు మామిడిపండ్లు కొనెను. రామకృష్ణుఁడు మా బడిలో మొదటివాఁడు.

ఇట మూఁడు – మొదటి అనునవి నామవాచకముచే చెప్పఁబడిన వస్తువులను ప్రకటించుచున్నవి. కావున సంఖ్యావాచక విశేషణములు.

♦ నామవాచకములచే ప్రకటింపఁబడు వస్తువులను ఎన్నింటిని, లేక వానిని ఏక్రమములో గ్రహించునవి సంఖ్యావిశేషణములు.

♦ ఈ సంఖ్యావాచక విశేషణములు, కేవల సంఖ్యావాచకములు, పూరణార్థకములు అని రెండు విధములు.

రెండవ (రెండు + అవ) తరగతి – ఇందలి అవ పూరణార్థకము. కావున రెండవ తరగతి ఇది పూరణార్థక సంఖ్యావాచక విశేషణము.

♦ సంఖ్యావాచకములకు 'అవ' చేర్చుటవలన పూరణార్థకము లేర్పడును.

ఉ :-రెండు – రెండవ, మూఁడు – మూఁడవ, ఆరవ, పదవ మొ.

ఒకటి – ఒకటవ అని కాని, వందను – వందవ అని కాని, రూపములు లేవు. ఒకటి – మొదటి అని సంస్కృతములో ఏకకు – ప్రథమవలె వాడవలెను.

భారత కాలమునాఁటికి అవకు బదులు అగు వాడుకలో ఉన్నది-ఏడగు పర్వము, పదుమూఁడగు పర్వము. అది క్రమముగా అవ, ఓ గా మాఱెను. మూఁడగు జాము - మూఁడవ జాము - మూఁడో జాము.

## క్రియావాచక విశేషణము.

| | |
|---|---|
| వంట యిల్లు | వండునట్టి యిల్లు |
| పంటపొలము | పండునట్టి పొలము |
| పూఁత కొమ్మ | పూచునట్టి కొమ్మ |

పై సమాసములలోని మొదటి పదములు విశేష్యముల (నామవాచకముల) వ్యాపారములను దెలుపుచు క్రియా విశేషణములగుచున్నవి.

♦ విశేష్యములకు (నామవాచకములకు) సంబంధించిన క్రియలను దెలుపునవి క్రియావాచక విశేషణములు.

(క్రియ = వ్యాపారము. ఈ క్రియావాచక విశేషణములు విశేష్యములనుబట్టి లింగవచనముల మార్పు చెందును.

## కొన్ని విశేష్యములను విశేషణములుగా వాడుట.

కోడి పుంజు, నన్నయ కవి, వెండి గిన్నె, బంగారు కంచము.

ఇందలి కోడి పదము విశేష్యము (నామవాచకము) అయ్యును, పుంజు అను దానికి విశేషణమయ్యెను. కావున కోడి అను విశేష్యము విశేషణమైనది.

## అభ్యాసము

1. విశేషణ మన నేమి?
2. గుణవాచక విశేషణ మన నేమి?
3. నిర్దేశక విశేషణ మన నేమి?

ఈ క్రింది వాక్యములలోని విశేషణములను పేర్కొని, అవి యేయే విశేషణములో తెలుపుము.

1. కాయకొమ్మ, 2. ఎత్తుచెట్టు, 3. తెల్లతామర, 4. ఆఱు గుఱ్ఱములు.

---

## 9. కాలము - తద్ధర్మకాలము.

పక్షులు కూయును - రాముఁడు వ్రాయును.

ఇక్కడ, కూయును - వ్రాయును - అనునవి వాని వాని ధర్మములను తెలుపు క్రియలు. ఏలయన పక్షులు కూయుటయు, రాముఁడు వ్రాయుటయు సహజములు. పక్షులింతకు మునుపు కూసినవి. ఇప్పుడు కూయుచున్నవి. ఇఁక ముందుకూడ కూయఁగలవు. 'కూయును' అనునది ఈ మూఁడు కాలముల యర్థమునుగూడ తెలియఁజేయును.

♦ భూత, వర్తమాన, భవిష్యత్కాలములకంటె వేఱై, యీ మూఁడింటి యర్థములందును వాడఁబడునది తద్ధర్మార్థక క్రియ.

తద్ధర్మ కాలమనఁగా ఆయా నామవాచకములు మొదలగు వాని ధర్మము మొదలగు వానిని తెలియఁజేయు కాలము. ఇది భూత, వర్త

మాన, భవిష్యత్కాలములలో దేనిని గురించి కాని ప్రత్యేకముగా తెలుపదు. కాని అన్ని కాలముల అర్థమును తెలుపును.

ఈ దిగువ వానిని ధాతువులకుఁ జేర్చినచో వాని తద్ధర్మకాలరూపములు ఏర్పడును.

| | | | |
|---|---|---|---|
| i. | ప్ర. | ను | దురు |
| | మ. | దువు, దు | దురు |
| | ఉ. | దును | దుము |
| ii. | ప్ర. | చదువును | చదువుదురు |
| | మ. | చదువుదువు<br>చదువుదు | చదువుదురు |
| | ఉ. | చదువుదును | చదువుదుము |

ఈ తద్ధర్మార్థక రూపాంతరములనుగూడ నెఱుంగునది.

| | | | |
|---|---|---|---|
| i. | ప్ర. | ఎడును, ఎడిని | ఎదరు |
| | మ. | ఎదవు | ఎదరు |
| | ఉ. | ఎదను | ఎదము |
| ii. | ప్ర. | చదివెడును<br>చదివెడిని | చదివెదరు |
| | మ. | చదివెదవు | చదివెదరు |
| | ఉ. | చదివెదను | చదివెదము |

1. సూర్యుఁడు తూర్పున ఉదయించును, 2. మంటలు పైలేచును, 3. రాముఁడు వేదము చదువుచుండును, 4. వత్తువా రావా, 5. అది తలఁచిన డోఁకు వచ్చును, 6. అతఁడు రేపు వచ్చును.

పై వాక్యములను పరికింపుము.

మొదటిది కర్త ధర్మమును, రెండవది కర్త స్వభావమును, మూఁడవది ఊహించిన విషయమును, నాల్గవది సంశయముతోఁగూడిన ప్రశ్నను, ఐదవది వర్తమానకాలమునకు బదులు రూపమును, ఆఱవది భవిష్యత్కాలమును సూచించుచున్నవి. కావున ఇవి తద్ధర్మార్థక క్రియలుగల వాక్యములు.

♦ 1. కర్త ధర్మమును ప్రకటించుటకును, 2. స్వభావమును ప్రకటించుటకును, 3. ఊహించి విషయములను చెప్పుటకును, 4. సంశయములతోఁగూడిన ప్రశ్నలకును, 5. వర్తమాన, 6. భవిష్యత్కాలములకును తద్ధర్మకాలక్రియా రూపము లుపయోగింపఁబడును.

ఉదా :— 1. పక్షులాకాశమున నెగురును.

2. నీరు పల్లమునకు పాఱును.

3. శ్రీమేశ్వరి యిప్పుడు వీణ వాయించుచుండును.

4. రైలు తణుకులో ఆఁగునా ? ఆఁగదా ?

5. వాఁడీ వ్యాకరణము చదివిన విజయము గాంచును.

6. వీరు రేపు వెళ్ళుదురు.

## అభ్యాసము

1. తద్ధర్మార్థక క్రియ యేయే కాలములను సూచించుచుండును ? ఎట్లు ?

2. తద్ధర్మార్థకక్రియ యేయే యర్థములయం దుపయోగింపఁ బడును ?

3. ఈ క్రింది పదము లేయే అర్థములందు వాడఁబడెను?

1. మేము రేపు భారతము చదువుదుము, 2. చిలుకలు పలుకును, 3. ఇప్పుడు విక్రమ దేవవర్మ సభతీర్చియుండును, 4. వెన్నెల జగమంతటను ప్రాఁకును, 5. ఆ మాట విన్నవాఁడు గంతులు వేయును, 6. వాఁడు వచ్చునా? రాఁడా?

---

## 10. కర్త్రర్థక, కర్మార్థక ప్రయోగములు.

### కర్త్రర్థకము.

ఆమె కథను చెప్పుచున్నది.

ఆమె కథను చదువుచున్నది.

### కర్మార్థకము.

ఆమెచే కథ చెప్పఁబడుచున్నది.

వారిచే కథలు చెప్పఁబడుచున్నవి

కర్త్రర్థకములో కర్తకు ప్రాముఖ్యముండును గాన కర్త ప్రథమ విభక్తిలో నుండును.

కర్మార్థకములో కర్తకు ప్రాముఖ్యముండును కావున కర్మ ప్రథమావిభక్తిలో. ఉండును.

పై యుదాహరణములనుబట్టి క్రియలు కర్త్రర్థకములని కర్మార్థకములని రెండువిధములని తెలియుచున్నది.

♦ కర్త్రర్థకరూపమునకు 'పడు' అనుదానిని చేర్చుటచే కర్మార్థకరూప మేర్పడును.

ఉ:-కర్త్రి. విక్రమదేవవర్మ తెలుఁగురాజునకు భూమి నిచ్చెను.
కర్మ. విక్రమదేవవర్మచే తెలుఁగురాజునకు భూమి యీయఁబడెను.

కర్త్రి. మీ అమ్మ ఏమి పెట్టెను.
కర్మ. మీ అమ్మచే ఏమి పెట్టఁబడెను.
కర్త్రి. వానిని కాపాడుము.
కర్మ. నీచే వాఁడు కాపాడఁబడుఁగాక.

పై యుదాహరణములను గాంచినచో కర్మార్థకమునందు కర్త్రి పదమునకు తృతీయావిభక్తి వచ్చుననియు (కర్మచే) కర్మవాచకమునకు ప్రథమ వచ్చుననియు (తెలుఁగురాజు) క్రియాపదమునకు 'పడు' వచ్చుననియు తెలియనగును.

## అభ్యాసము

1. కర్త్రర్థకమన నేమి ?
2. కర్మార్థకమన నేమి ?
3. దేనిని చేర్చిన కర్మార్థక మేర్పడును ?
4. కర్మార్థకమందు కర్త యేవిభక్తిలో నుండును ? కర్త్రర్థకమందే విభక్తిలో నుండును ?
5. ఈ క్రింది వాక్యములను కర్మార్థకములుగా మార్చుము.
   పండితరాజు వ్యాకరణము వ్రాసెను.
   శ్రీకృష్ణుఁడు వేణువు నూఁదెను.

## 11. క్రియల రూపనిష్పత్తి: సింహావలోకనము.

### క్రియలు.

వ్యాపారమును తెలుపునవి.

### సమాపక క్రియలు.

ప్రతి క్రియకు భూతకాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము, తద్ధర్మకాలము అని నాలుగు కాలములు. ప్రతి కాలమునకు ప్రథమ - మధ్యమ - ఉత్తమములని మూఁడేసి పురుషములు. ప్రతిపురుషమునకు ఏకవచన బహువచనములని రెండేసి వచనములు గలవు.

i. భూతము : జరిగిపోయినకాలము భూతకాలము.

ii. వర్తమానము : జరుగుచున్నకాలము వర్తమానకాలము.

iii. భవిష్యత్తు : రాఁగలకాలము భవిష్యత్కాలము.

iv. తద్ధర్మకాలము : పైమూడు కాలములకంటె వేఱై మూఁడింటి యర్థములందును ఉపయోగింపబడునది తద్ధర్మకాలము (వస్తువులయొక్క సహజధర్మములను స్వభావములను తెలుపుకాలము. ఇది పై మూఁడు కాలములను సూచించును.)

- నేను - మేము, నీవు - మీరు అనునవిగాక మిగిలిన శబ్దములు (నామవాచకములు - సర్వనామములు) కర్తలుగాఁగల క్రియలు ప్రథమపురుషములు.
- నీవు - మీరు అనునవి కర్తలుగాఁగల క్రియలు మధ్యమపురుషములు.
- నేను - మేము అనునవి కర్తలుగాఁగల క్రియలు ఉత్తమపురుషములు.

ధాతువులకు (క్రియల మూలరూపములకు, వచ్చు - దువు - మొ.) చివర నాయా పురుషములందు వచ్చుక్రియా ప్రత్యయము లీక్రింద వివరింపఁబడుచున్నవి.

| | ఏ | బ | ఏ | బ |
|---|---|---|---|---|
| ప్ర. | ఁడు | రు | వాఁడు వచ్చుచున్నాఁడు, | వారువచ్చుచున్నారు |
| మ. | వు | రు | నీవు వచ్చుచున్నావు, | మీరు వచ్చుచున్నారు |
| ఉ. | ను | ము | నేను వచ్చుచున్నాను, | మేము వచ్చుచున్నాము |

## భూతకాలము.

ఈ క్రింది వానిని ధాతువులకుచేర్చిన భూతకాలరూపము లేర్పడును.

| | | ఏ. | బ. |
|---|---|---|---|
| 1. | ప్ర. | ఎను | ఇరి |
| | మ. | ఇతివి | ఇతిరి |
| | | ఇతి | |
| | ఉ. | ఇతిని | ఇతిమి |

ii. ప్ర. వాఁడు చదివెను　　వారు చదివిరి
మ. నీవు చదివితివి　　మీరు చదివితిరి
నీవు చదివితి
ఉ. నేను చదివితిని　　మేము చదివితిమి

## వర్తమానకాలము.

| ఏకవచనము | | బహువచనము |
|---|---|---|
| i. | ప్ర. చున్నాఁడు, చున్నది | చున్నారు, చున్నవి |
| | మ. చున్నావు | చున్నారు |
| | ఉ. చున్నాను | చున్నాము |
| ii. | ప్ర. వాఁడు చదువుచున్నాఁడు | వారు చదువుచున్నారు |
| | మ. నీవు చదువుచున్నావు | మీరు చదువుచున్నారు |
| | ఉ. నేను చదువుచున్నాను | మేము చదువుచున్నాము |

## భవిష్యత్కాలము.

ఈ దిగువ వానిని ధాతువులకు చేర్చిన భవిష్యత్కాలరూపము లేర్పడును.

| | | |
|---|---|---|
| i. | ప్ర. అఁగలఁడు | అఁగలరు |
| | అఁగలదు | అఁగలరు |
| | మ. అఁగలవు | అఁగలరు |
| | ఉ. అఁగలను | అఁగలము |
| ii. | ప్ర. వాఁడు చదువఁగలఁడు | వారు చదువఁగలరు |
| | ఆమె చదువఁగలదు | వారు చదువఁగలరు |
| | మ. నీవు చదువఁగలవు | మీరు చదువఁగలరు |
| | ఉ. నేను చదువఁగలను | మేము చదువఁగలము |

## తద్ధర్మకాలము.

దీని రూపములను గూర్చి యీ వఱకె తెలుపఁబడెను. చూడు పుట 34.

## అభ్యాసము

1. క్రియ యనగ నేమి?
2. ధాతువులన నేమి?
3. వర్తమానకాల మధ్యము పురుష క్రియ ఏకవచన బహువచన ప్రత్యయము లేవి?
4. భవిష్యత్క్రియ ప్రథమపురుష ఏకవచన బహువచన ప్రత్యయము లేవి?
5. భూతకాలక్రియ ఉత్తమపురుష ఏకవచన బహువచన ప్రత్యయము లేవి?
6. తద్ధర్మకాలమన నేమి?
7. తద్ధర్మార్థక క్రియాప్రత్యయము లేవి?
8. ఈ క్రింది వాక్యములలోని నాలుగు కాలక్రియలను గుర్తింపుము.
   1. శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తెను, 2. వాఁడు వంట వండెడిని, 3. వాఁడు రేపు రాఁగలఁడు, 4. ఆమె రేపు వచ్చును, నేను పద్యము వ్రాయుచున్నాను.

## 12. సమాపక - అసమాపక క్రియలు

### సమాపక క్రియలు.

1. రాముఁడు పాఠము చదివెను.
2. వాఁడు పద్యము వ్రాసెను.

ఈ రెండు వాక్యములు సంపూర్ణాభిప్రాయమును దెలిపినవి కావున సమాపక క్రియలు.

♦ సంపూర్ణాభిప్రాయమును వెల్లడించు క్రియలు సమాపకక్రియలు (పనిని ముగించినట్లు చెప్పునవి.)

'రాముఁడు పద్యము చదివి'

ఈ వాక్యమున అర్థము పూర్తి కాలేదు. కావున 'చదివి' అసమాపక క్రియ.

♦ సంపూర్ణాభిప్రాయమును వెల్లడింపఁజాలని క్రియలు అసమాపకక్రియలు (పనిని ముగియకుండఁ జెప్పునవి.)

ఉ:-కృష్ణుడు పాఠము చదివి, బడికి వెళ్ళి, పద్యము ఒప్పఁజెప్పి చనెను. ఇందు చదివి, వెళ్ళి, ఒప్పఁజెప్పి, ఇవి అసమాపక క్రియలు.

### అభ్యాసము

1. సమాపక క్రియ అన నేమి?
2. అసమాపక క్రియ అన నేమి?
3. సమాపక క్రియలతోను, అసమాప క్రియలతోను నాలుగేసి వాక్యములు వ్రాయుము.

## 13. అవ్యయములు - క్రియాజన్య విశేషణములు.

### అవ్యయములు.

1. వాఁడు అన్నము, తిని తినక బడికి వెళ్ళి ఊరకె కూరుచుండును.
2. ఆ బడిలోని పిల్లలు ఎట్లు చదువుచున్నారో, ఎప్పటికప్పుడు ఉపాధ్యాయులు మఱిమఱి శ్రద్ధతో మరల మరల కనుగొనుచునే యుందురు.

పై వాక్యములను చూడుము. క్రింద గీఁతలుగలవెల్ల అవ్యయములు. వానికి లింగముగాని, విభక్తిగాని, వచనముగాని లేదు.

♦ లింగవిభక్తివచనములు లేనిశబ్దములు అవ్యయములు.

ఇవి రెండు విధములు.

1. ప్రతిపదోక్తములు, 2. లాక్షణికములు.

స్వతస్సిద్ధములయిన అవ్యయములు ప్రతిపదోక్తావ్యయములు. అనఁగా పుట్టుకలోనే లింగాదులు లేనివియు, వాడుకలో లింగాదులను విడిచి యితరార్థములందు స్థిరపడిన కొన్ని శబ్దములును ప్రతిపదోక్తావ్యయములు, ధాతువుల నుండి పుట్టిన అవ్యయములు లాక్షిణకములు, (అనగా వ్యాకరణముచే ఏర్పడినవి.)

ప్రతిపదోక్తావ్యయములన్నియు దేశ్యములు, లాక్షణికావ్యయములలో తత్సమములు, తద్భవములు, దేశ్యములు గూడఁ గలవు.

## ప్రతిపదోక్తావ్యయములు.

అంత, అందు, అఁట, అక్కట, అదిగో, అద్దిరా, అమ్మచెల్ల, అయ్యో, అయ్యారే, అరే, బళే, ఆ అ ఈ అఁ ఉఁ ఎ ఏ ఓ అన్నా అమ్మమ్మా, అమ్మకొ, ఆహాహా, ఆవల, ఇంచుక, ఇఁక, ఇసే, ఊరక, ఎంత, ఎట్లు, ఎట్టకేని, ఎట్టెట్టూ, ఎప్పటికి, ఎల్ల, ఏని, పల, ఒండె, ఒత్తిరి, ఓయి, ఓహో, ఔర, కడు, కదా, కనుక, కోలె, వలె, కోసము, క్రమ్మఱ, చుండి, చెఱి, తద్దయు, మిక్కిలి, తలా, దనుక, దాఁక, పోరిపోరి, మఱి, బులా, వెండియు, హుటాహుటి, హోరా హోరి, రవరవ, రే, రా, ఒకో, జే, సరి, వెంటన్, కోర్చి, మెయిన, చేసి, ఉండి, పట్టి, మొదలైనవి.

## లాక్షణికావ్యయములు.

తిని, తినక, తినుచున్, తినను, తినన్, తినఁగన్, తినఁగాన్, చదువుడున్, చదివినన్.

ఇవియన్నియు తిను - చదువు - అను క్రియలనుండి యేర్పడినవి. కావున లాక్షణికావ్యయములు.

♦ ధాతువులనుండి పుట్టిన యవ్యయములను లాక్షణికావ్యయములందురు.

[1. క్త్వార్థకములు - కని, చూచి మొ॥ 2. వ్యతిరేక క్త్వార్థకములు - కనక, చూడక మొ॥ 3. శత్రర్థకములు - (వర్తమాన) తినుచున్, కనుచున్ మొ॥ 4. తుమర్థకము - తినను, తినన్, చదువను, చదువన్ మొ॥ 5. అనంతర్యార్థకములు - చదువుడున్, వ్రాయుడున్, మొ॥ 6. చేదర్థకములు - చదివినన్, వినినన్ మొ॥ చదువఁన్, చదువఁగాన్ మొ॥]

స్వస్తి, సదా, వృథా, కించిత్తు, సర్వదా మున్నగు సంస్కృతావ్యయములు తెలుఁగులో ప్రత్యేకముగా వాడఁబడుచున్నవి.

"ప్రతి" అనునది తెలుగులో వాడఁబడు చున్నది.
నీ ప్రతిలేరు. నీ ప్రతిగ నర్చింతుము.
ప్రతి రఘువీరుఁడొక్కఁడే.

## క్రియాజన్య విశేషణములు.

వ్రాసిన, వ్రాయను, వ్రాయుచున్న, వ్రాయగల, వ్రాసెడు ఇవి వ్రాయు ధాతువునుండి పుట్టినవి.

♦ ధాతువులఁవలన బుట్టినవి ధాతుజ విశేషణములు. వీనినే క్రియాజన్య విశేషణములందరు.

♦ ధాతువునకు 'ఇన' చేర్చిన భూతార్థక క్రియాజన్య విశేషణమగును.

ఉ :- వచ్చిన, ఎఱుఁగఁబడిన మొ॥

♦ వ్యతిరేకమున 'అని' వచ్చును.

ఉ :- రాని, వ్రాయని, ఎఱుఁగఁబడని మొ॥

♦ "ఉన్న" వర్తమానార్థకముల కగు.

ఉ :-తినుచున్న, కనుచున్న మొ॥

♦ "అఁగల" భవిష్యదర్థంబునందు.

ఉ :-వ్రాయఁగల, తినఁగల, వినఁగల మొ॥

* ఎడు, ఎడి అనువానితోఁగూడి తద్ధర్మార్థక క్రియా విశేషణము లేర్పడును.

ఉదా :-వచ్చెడు, వచ్చెడి, కనెడు, కనెడి మొ॥

క్రియాజన్య విశేషణములకు విభక్తి వివక్షించునప్పుడు మహదర్థకంబునందు 'వాడు' మహతి, అమహతర్థకంబులందు "అది" అను శబ్దములను ప్రయుక్తములగు.

ఉ :-వ్రాసినవాడు, వ్రాసినది, తినినవాడు, తినినది మొ.

## అభ్యాసము.

1. అవ్యయమన నేమి?
   అవి ఎన్ని విధములు? అవి యేవి?
2. ఈ క్రింది పదములలోఁగల అవ్యయములు ఏ తరగతికి జెందినవో తెలుపుము.
   తినక ; మిక్కిలి ; వ్రాయుచున్ ; బలే ; చూడఁగన్ ; చాలా ; చదువను ; అయ్యో ; వినుచున్.
3. నాలుగు ప్రతిపదోక్తావ్యయములను, నాలుగు లాక్షణికావ్యయములను ఉపయోగించి ఒక వాక్యమును వ్రాయుము.

A. క్రియాజన్యవిశేషణ మన నేమి?

4. ఏప్రత్యయము చేర్చిన భూతార్థక క్రియాజన్య విశేషణమగును?
5. "వినఁగల" ఇది ఏకాలమును తెలుపు క్రియాజన్య విశేషణము?
6. వర్తమానార్థక, తద్ధర్మార్థక క్రియాజన్యపు విశేషణములకు ఏప్రత్యయములు చేర్పఁబడును?

## 14. సంధులు.

### అకార, ఉకార సంధులు.

మాయమ్మయు, మేనత్తయు, కలిసి వారివారి పుట్టినయిండ్లకరుగు నపుడు రాముఁడెదురయ్యెను.

పై వాక్యములో క్రింద గీఁతలుగలచోట్ల అకార ఉకార సంధులు గలవు.

* సంధియనఁగా కలయుక. విడివిడిగానున్న యుంగరము లొకదానితో నొకటిచేర్చినచో ఒకగొలుసయినట్లు ఒకమాట మఱియొకమాటతో కలిసికొనిపోవుట సంధి. ఈ సంధి రెండచ్చులు కలిసికొనునపుడుగాని, రెండుహల్లులు కలిసికొనునపుడుగాని, ఒకయచ్చును, ఒకహల్లును కలిసికొనునపుడుగాని జరుగును. ఇచ్చట అచ్చులసంధి చూపఁబడుచున్నది.

ఉ :-రాముఁడు అడవికి అరిగి అచటన్ ఒక అందము ఐన లేడిన్ అరసెను.

"రాముఁడడవి కరిగి యచట నొకయందమైన లేడి నారసెను." అని వ్రాయుటయే సంధికూర్చి వ్రాయుట.

### వివిధములైన సంధుల కుదాహరణములు.

మీ + ఇల్లు = మీ + య్ + ఇల్లు = మీయిల్లు (ఆగమసంధి)

నిద్ర + పోయెను = నిద్రపోయెను (ఆదేశసంధి)

నా + అది = నాది (లోపసంధి)

వచ్చెన్ + గోవులు = వచ్చెన్గోవులు (సంశ్లేష సంధి)

## అకారసంధి.

♦ మొదటిపదము చివరి అచ్చుపోయి, రెండవ పదము మొదటిఅచ్చు నిలుచుట అచ్సంధి.

♦ అకారమునకు అచ్చు పరమగునపుడు సంధి బహుళము.

## బహుళము.

i. కొన్నియెడల సంధి నిత్యముగా (తప్పక) వచ్చుట.
ii. కొన్నియెడల వైకల్పికముగా వచ్చుట (కలిసి యొక రూపము కలియక యొక రూపము).
iii. కొన్నియెడల నిషేధము (కలియక పోవుట).
iv. కొన్ని యెడల అన్యవిధము (ఇతర కార్యములు కూడ వచ్చుట).

## నిత్యసంధి.

సోమన్న = రామయ్య ; సోమ + అన్న = సోమన్న ; మలోని అకారమునకు అన్నలోని అకారము పరమైనది.

♦ నామముల తుది అకారమునకు పరముగ శ్లేష్మార్థక ములగు అన్నాదులును, అకును పరమైన సంధి నిత్యము.

అన్న - అయ్య - అక్క - అమ్మ - అప్ప - అయి - అవ్వ - అడుసు ఇవి అన్నాదులు.

భీమక్క - భీమమ్మ - రామమ్మ - వెంకప్ప - పాపాయి - చింతాకు - పొన్నాకు, తిమ్మరుసు మొ.

## వైకల్పిక సంధి

మేన + అత్త = మేన + య్ + అత్త = మేనయత్త (సంధి కలియనిది) మేనత్త (సంధికలిసినది.)

♦ మేనాదుల హ్రస్వ (కుఱుచ) అకారము (అత్తు) నకు సంధి వైకల్పికము.

♦ సంధిలేనిచోట యడాగమము (య్ + ఆగమము) అగును.

ఆగమము = వర్ణాధిక్యము. (క్రొత్తయక్షరము అధికముగా వచ్చుట)

| | | |
|---|---|---|
| ఉ:- పుట్టిన + ఇల్లు | పుట్టినయిల్లు, | పుట్టినిల్లు |
| ఉండిన + అతఁడు | ఉండినయతఁడు | ఉండినతడు |
| చేయక + అనెను | చేయకయనెను | చేయకనెను |
| నూట + ఒకటి | నూటయొకటి | నూటొకటి |
| వెల్ల + ఏనుగు | వెల్లయేనుఁగు | వెల్లేనుఁగు |

## నిషేధసంధి.

హంస యెగురుట కాంచి అమ్మ యాశ్చర్యపడి రామా యిటురా యని కొడుకును పిలిచి యా వచ్చువాఁడ యాత్మజుఁడని తలఁచెను.

పై వాక్యములో క్రింద గీతలుగల పదములకు సంధిరాలేదు. యడాగమము వచ్చినది.

హంస - తత్సమము, అమ్మ స్త్రీ వాచకము, రామా సంబోధనము వాడ అవధారణము. కావున దీనికి సంధి కలుగదయ్యెను. యడాగమము వచ్చెను.

♦ స్త్రీవాచక, తత్సమ, సంబోధన, అవధారణములకు సంధిలేదు.

అనగా మొదటి శబ్దము చివర ఆకారముండినను ఆశబ్దము స్త్రీ వాచకముగానో, తత్సమముగానో, సంబోధనాంతముగానో, అవధారణార్థకముగానో, (ఏవార్థకము. అ ఎ ఏ అనునవి చేరి నిశ్చయార్థమును తెలుపునవి) యుండిన సంధి లేదు. సంధి లేనిచో యడాగమము.

ఉ :- స్త్రీవాచకము — అమ్మ + అది — అమ్మయది
తత్సమము — భామ + ఇది — భామయిది
స్త్రీవాచక సంబోధనములు కొమ్మ + ఇమ్మ కొమ్మయిమ్మ
అవధారణము రాముడ + ఇతడు రాముడ యితడు
వెల + ఆలు వెలయాలు వెలాలు అని వ్రాయరాదు. ఇచ్చట "వెల" అనునది స్త్రీవాచకము, తత్సమము, సంబోధనము, అవధారణము కాకున్నను 'అత్తునకు సంధి బహుళము' అను సూత్రములోని బహుళము అనుదానిచే సంధి కలుగలేదు.

తామర + ఆకు = తామరాపాకు. ఇచట 'పు' ఆగమము కూడ బహుళమగుటచేత నే వచ్చెను.

పాతకు లారని (ఆముక్తమాల్యద)
జైనులారెన్నడు (బసవపురాణము)

♦ కొన్నిచోట్ల 'అర' గాగమము వచ్చిన బోధనమునకు కొన్ని చోట్ల సంధి కానంబడుచున్నది.

రంగ ద్భర్తంచు, గంగనుకాసి
పైవి తత్సమ సంధులు.

♦ తత్సమములకుఁగూడఁ గొన్నిచోట్ల సంధి కానంబడుచున్నది.

కురురాజులొద్ద ఆర్యులొద్ద.
ఇవి షష్ఠీసమాసమునకైన సంధులు. (కర్మధారయములు కానివి)

♦ షష్ఠీసమాసమునందు అకారమునకు అచ్చు పరమగునపుడు ఎల్లయెడల సంధి బహుళము.

ఉ :-బాహులాదము రాజులాజ్ఞ.
మా + ఇల్లు = మా యిల్లు.
ఇది దీర్ఘాచ్చుకాన సంధిలేదు.

♦ దీర్ఘాచ్చునకు సంధిలేదు.
ఉ :-మీా యిష్టము, పల్లకీ యెక్కెను. మొ॥

[సప్తఋషులు, దేవఋణము మొదలైనవానికి సంధిలేదు. ఇదే ప్రకృతిభావము. ఏవిధమైన సంధి రాకపోవుటయే ప్రకృతిభావము.]

## అభ్యాసము

1. సంధియన నేమి?
2. అత్తునకు సంధి ఎట్లగును?
3. బహుళమన నేమి? వివరింపుము.

4. నిత్యనిషేధసంధులకు రెండేసి యుదాహరణములు తెలుపుము.
5. చేయక ననెను. ఇది యేసంధి?
6. కృష్ణయది - ఇదేసంధి?
7. ఈ క్రింది వాక్యములోని దోషములను సవరించి కారణములను వివరింపుము.

చింతయాకు చూచి యమ్మది కోకిలాకలి తీర్చునని రాముఁ డిటురమ్మ అని పిలిచెను.

## ఉ కా ర స ం ధి.

రాముఁడంతట వరమిచ్చి కూరుచుండెను.

పై వాక్యములో గీఁతలుగల పదములు విడఁదీసినచో రాముఁడు + అంతట, వరము + ఇచ్చి, కూరుచు + ఉండెను. అని యగును.

ఈ మూఁడు పదముల చివర ఉకారములున్నవి. ఈ ఉకారములకు అ - ఇ - ఉ అను అచ్చులు పరమైనవి. సంధి నిత్యముగా కలిగినది.

♦ ఉత్తున కచ్చు పరమగునపుడు సంధి నిత్యము.

ఈ సూత్రమునుబట్టి గ్రహింపవలసిన దేమంటే కేని 'డు ము వు' లు విభక్తుల ఉకారమునకును, ప్రథమావిభక్తిరూపములైన మిగిలిన నామవాచక సర్వనామవాచకముల విశేషణముల ఉకారమునకు అవ్యయముల యొక్కయు, క్రియాపదముల యొక్కయు ఉకారమునకును సంధినిత్యము.

ఉ :- శంభువు + అతఁడు, శంభువతఁడు

ప్రజలు + అందఱు, ప్రజలందఱు

ఇపుడు + ఇది, ఇపుడిది

గట్టు + అది, గట్టది
రాఁడు + అతఁడు, రాఁడతఁడు
కన్నను + అది కన్ననది.

♦ నన్నడిగె, నన్ననడిగె, పోవుచున్నాఁడు, పోవుచునున్నాఁడు.

పైవానిని చూడుము. సంధివచ్చి యొక రూపము రాక యొక రూపము గలవు.

♦ ప్రథమేతరవిభక్తి, శత్రర్థకచువర్ణములందున్న ఉత్తునకు సంధి వైకల్పికము.

ప్రథమావిభక్తిగాక, మిగిలిన విభక్తులయందు 'ఉ' ప్రత్యయము అనఁగా ను - కొఱకు - కు - అందు - ఇందు - ఎందు దీనికడపటి ఉకారమునకు అని అర్థము.

♦ అచ్చులకు సంధి యగునపుడు నడుమనున్న ద్రుతము లోపించునని గ్రహించునది.

ఉ :-నన్నున్ + అడిగె - నన్నడిగె, నన్నునడిగె.
నాకొఱకున్ + ఇచ్చె - నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె.
నాకున్ + ఇచ్చె - నాకిచ్చె, నాకునిచ్చె.
అందున్ + ఉన్న - అందున్న, అందునున్న.

శత్రర్థక చువర్ణము - వర్తమానకాలమందలి 'చు' వర్ణకము. దీనికి సంధిపైయట్లు వైకల్పికము.

ఉ :-పోవుచు + ఉన్నాఁడు - పోవుచున్నాఁడు, పోవుచునున్నాడు.

చూచుచున్ + ఏఁగె - చూచుచేఁగె, చూచుచునేఁగె.

వ్రాయుచున్నాఁడు - వ్రాయుచునున్నాఁడు,

♦ రూపాంతరమందు ద్విత్వము కలిగిన శబ్దముల ఉకారమునకు సంధి లేదు.

కను-కన్ను, మిను-మిన్ను, మమున్-మమ్మున్ అని రూపాంతరములు.

కావున కన్నదరె, మమ్మడిగెను అనవచ్చునుగాని కనదరె, మమడిగె అని వ్రాయరాదు.

♦ వాక్యము ముగిసినపుడు వెనుకటియుచ్చుతో సంధి లేమి దోషము లేదు.

ఒక వాక్యము ముగిసినపుడు వెనుకటియుచ్చుతో సంధి కలుపక పోయినను దోషము కాదని తాత్పర్యము.

ఇక్కడ, వాక్యమనఁగా - కర్త సమాపకక్రియ కలిగి సంపూర్ణమైన యర్థసమూహముగల శబ్దసమూహమును, పద్యములలోని ఒక్కొక్క పాదమును - అని గ్రహించునది.

ఉ:-రాముఁడు యోగ్యుఁడు. అతనిని నమ్మినవారికి శుభము లొసంగును. ఇక్కడ రాముఁడు యోగ్యుఁడు అనుదానిలో కర్త మొదలైన శబ్దసమూహము గలదు. అర్థము సంపూర్ణముగా ఉన్నది. కావున దానికి వాక్యమని పేరు. వాక్యము తుదను 'డు' ఉకారాంతము. దానికి 'అతని'లోని 'అ' పరమైనది.

పద్యపాదములకు సంధి లేమికి ఉదాహరణములు.

1. ఎందును పుష్పసౌరభము, యెందును మందమరాళఝుంకృతుల్
ఎందును సాంద్రపల్లవము. (వృ. సిం. పు. 2 అ. 62 ప.)

2. విభవములు పొందు చాళుక్య విశ్వవిభుఁడు
అలరు విల్తునిభంగి. (కా. వ్యా. చూ. 1 ఉ. 27 ప.)
3. అర్థాసేవించిరొక కొంద రప్సరసలు
అపుడు రెండవకైలాసమనఁగఁ బరఁగె. (భా.ఖు.5ఆ. 48 ప.)
4. అనలుఁ డర్కజుఁ డసురేశుఁ డబ్ధిరాజు అనిలుఁ డర్థేశుఁ డళికలోచనుఁడు గొలువ. (వసు. చ. 3 ఆ. 5 8 ప.)

పై వానిని బట్టిచూడ పద్యములలో అర్థము ముగిసినను, ముగియకున్నను సంధిలేమి దోషముగాదు.

## అభ్యాసము

1. ఉకారమునకు సంధి యేవిభక్తిలో నిత్యము? ఏవిభక్తిలో వైకల్పికము?
2. 'ఉత్తునకు సంధి నిత్యము' అనుదానినిబట్టి గ్రహింపవలసిన విషయమును వివరింపుము.
3. ఎచ్చట నెచ్చట సంధి లేకపోవుట దోషముగాదు?
4. రూపాంతరమును పొందిన యేశబ్దములకు సంధి చేయరాదు?

---

## 15. విరామచిహ్నములు, సింహావలోకనము.

. నూనబిందువు, అనుకరణచిహ్నము, కుండలీకరణము.

విరామచిహ్నములలో తొలుత, బిందువు, వాక్యాంశబిందువు, ప్రశ్నార్థకచిహ్నము, రాగచిహ్నము, సింహావలోకనము చేయఁబడుచున్నవి.

'.' బిందువు (చుక్క)
',' వాక్యాంశ బిందువు (కామా)
'?' ప్రశ్నార్థక చిహ్నము
'!' రాగ (భావ) చిహ్నము

## బిందువు.

♦ బిందువు ప్రతి సంపూర్ణవాక్యము చివరను ఉండును.

ఉ:- తెలుఁగురాజు మహాకవి. అతఁడు పెక్కు కావ్యములు వ్రాసెను.

ఇందు రెండు సంపూర్ణ వాక్యములున్నవి. రెండింటి చివరను బిందువులున్నవి.

బిందువు '.' వాక్యముచేఁ బ్రకటితమగు భావము పూర్తియైనది తెలుపునని తాత్పర్యము.

రా. రా. పో. పో. మ. శ్రీ. (మహారాజశ్రీ) శా. సం. (శాలివాహన శకము) క్రీ. పూ. (క్రీస్తుపూర్వము).

## వాక్యాంశ బిందువు.

వాక్యాంశబిందువు (కామా) ఇది విశ్రాంతి చిహ్నములన్నిటియందును దఱచుగా వాడఁబడుచుండును. ఇది మిక్కిలితక్కువ కాలపు టాపుదలను దెలుపును.

ఏదేని వచనము చదువునపుడు, మనము విశ్రాంతికొఱకుఁ గొంచెము సేపేతావుల నాఁగుదుమో యాతావుల వాక్యాంశ బిందువు వాడవలెను.

ఉ:-కృష్ణరాయలు, తన సేనలఁగొని హుటాహుటిగా, గజ్జ్కుమారికిఁ జనెను.

క్త్వార్థకావ్యయముల చివరఁగూడ నీవాక్యాంశబిందు వుంతురు.

ఉ :-శ్రీకృష్ణుఁడు, మధుర కేఁగి, యశోదను గాంచి, పాలుత్రావి, యాటలాడెను.

కాని – అనుపదముచే వేఱుచేయు వాక్యములచివరఁ గూడ దీనినుంతురు.

ఉ :-అందఱు విజయము గాంచ నెంతురు, కాని కొందఱే విజయము కొంతురు.

సముచ్చయము చివరగల పదములను, వాక్యములను గూడ ఈ వాక్యాంశబిందువుచే వేఱుచేయుదురు.

ఉ :-రాముఁడు, సీతయును, లక్ష్మణుఁడును అడవుల కేఁగిరి.

సమానధర్మములతోఁ గూడియుండు నుపమానవాచకముల పరంపరయుండునేని ప్రతిదానిని దీనిచే వేఱుచేయవలెను.

ఉ :-విక్రమదేవవర్మ దానముచే కర్ణుని, గాంభీర్యముచే సముద్రమును, శాంతముచే భూమిని, శుచిత్వముచే అగ్నిని, బుద్ధిచే బృహస్పతిని పోలుచున్నాఁడు.

రెండేసి యొకేజాతిపదముల సమూహములుపరంపర వచ్చినచో ఆయాపదము లన్నిటిని 'కామాలచే' వేఱుచుపవలెను.

ఉ :-ఇంటనైన, బైటనైన, రాత్రియైన, పవలైన సరే కవిరాజు కావ్యములు వ్రాయుచుండును.

సంబోధనలనుగూడ కొందఱు వాక్యాంశ బిందువుచే వేఱు చేయుదురు.

ఉ :-సూర్యనారాయణగారూ, మీరు వ్యాసములను వేగముగా వ్రాయుఁడు.

వాక్యముతో సంబంధములేని పదములను, పదసమూహములను కామాలచే విభజింతురు.

ఉ :-ఎట్లైన, వానికవిత్వము బాగుండును.

ఇతరుల తెలివి తక్కువను గణించునపుడు వాడఁబడు జంటవాక్యములను కామాలచే విభజింతురు.

ఉ :-వాఁడు అన్నెము ఎఱుఁగఁడు, పున్నెము ఎఱుఁగఁడు.

ఒక వాక్యమును దాని విస్తరణవాక్యములను కామాలచే విభజింతురు.

వానికి నూఱు పుస్తకములు గలవు, ఏఁబది వచన పుస్తకములు, ఏఁబది పద్యపుస్తకములు.

## ప్రశ్నార్థక చిహ్నము.

'?' దీనిని ప్రశ్నవాక్యముల చివర నుపయోగింతురు.

నీవు అన్నము తిన్నావా? వాఁడు వచ్చినాఁడా? పద్యము వ్రాసినావా?

♦ ప్రశ్న వాక్యములు చాలనున్నచో కడపటిదాని చివర మాత్రమే ప్రశ్నార్థక ముంచవలెను.

ఉ :-నీవు సినిమాకు వచ్చెదవా, రావా? అన్నము తిన్నావా, లేదా?

## రాగచిహ్నము.

'!' ఇది ఆశ్చర్యార్థకముల తరువాతను, ప్రశంసనార్థకముల తరువాతను సంతాపార్థముల తరువాతను, సంప్రార్థనార్థముల తరువాతను, ఆవేశవాక్యముల తరువాతను ఉంతురు.

ఉ:-బౌరా: యెంతవింత! బళే! ఏమి సంగీతము! పాపము! ఎంత పాపము చేసెనో! హా! రామచంద్రా! ఏమిటీ! కొట్టెదవా! రాచవాఁడెక్కడ! యీ పితికితన మెక్కడ!

## న్యూనబిందువు (ద్విబిందువు కోలను).

':' వాక్యాంశ బిందువుచే (కామా) ప్రకటింపఁబడు విశ్రాంతికంటె ఎక్కువ విశ్రాంతి కావలెనని లేఖకులకుఁ దోఁచినపుడు ఆయాచోట్ల ఈ న్యూన బిందువు (ద్విబిందువు) ఉపయోగింతురు.

ఉ:-సత్యాగ్రహము తప్ప యింకొకటి ఏమియు మన దేశపు ప్రజలనేకము చేసి యుండెడిది కాదు: ఇంకొకటేదియు మనదేశపు వర్తకమును పాడుచేసి యుండలేదు.

పూర్వమందుఁ జెప్పఁబడిన విషయమును నిశ్చయించునట్టిదాని, [illegible] నిరూపణ వాక్యమును కాని న్యూనబిందువుచే వేఱుచేయుదురు.

ఉ:-నీవెట్టి కావ్యమును వ్రాసినను సరే నీయారోగ్యమును సరిగా కాపాడుకొనవలయును: అనారోగ్య జీవితము వ్యర్థమని గ్రహింపుము.

నాకు భారతమన్నఁ జాలప్రీతి: అందును తిక్కన కవిత్వమన్ననుఁ బ్రీతి యధికము.

ఒక సూత్రమున కుదాహరణ ఇచ్చుచు ఉకారమును వ్రాయునపుడు ఈన్యూనబిందువు వాడుదురు.

ఉ:- "అడఁగు" లోని 'డ' కుఁణకారము విభాషనగు: అడఁగు, అణఁగు.

## అనుకరణచిహ్నము

" " వీనినే ఉద్ధరణ చిహ్నమనియు నందురు.

ఒకఁడు పలికిన పలుకు లట్లె వ్రాసి ప్రకటించినపుడా మాటలకు ఈ అనుకరణ చిహ్నము నుపయోగింతురు.

ఉ:-రాముఁడు లక్ష్మణునితో "లక్ష్మణా! యీ శూర్పణఖను ముక్కు చెవులు కోసి విడువుము" అనెను.

ఒక పుస్తకమునుండి యెత్తి వ్రాసిన భాగముయొక్క మొదట, తుదిని గూడ ఈ అనుకరణ చిహ్నము లుపయోగింతురు.

"కొంచెమైనను తగపంచికుడుపు మేలు"

అను తిక్కన వాక్యమెంత నీతిదాయకమైనది.

"అకారణబంధులుగారె సత్కవుల్"

అను పాపరాజు వాక్యమెంత సత్యమైనది!

పుస్తకముల పేరులను నీ యనుకరణముంచి వ్రాయుదురు.

"రామాయణము" చదువుచున్నాఁడు.

ఎత్తి వ్రాయఁబడిన వాక్యమునందలి యెత్తి వ్రాయఁబడిన వాక్యముయొక్క మొదటను తుదిని ఒకొక్క యనుకరణ చిహ్నమును మాత్రమె యుంతురు.

ఉ:- రాముఁడు లక్ష్మణునిఁ బిలిచి వానితో 'లక్ష్మణా! మన హనుమంతుఁడు సముద్రమును దాఁటి, లంకకేఁగి, దానిని దహించినపుడు రావణుఁడు వానిని బంధింపఁగా హనుమంతుఁడు

'ఓరీ రావణ వెంటనె
నారీమణియైన సీత నారాయణుఁడౌ
శ్రీరామున కర్పింపుము
నీ రాజ్యమదాంధ్యముడిగి నీల్గక వేగన్,

## కుండలీకరణములు.

వాక్యమునందు గ్రహణసౌలభ్యమునకై యుపయోగించెడు పర్యాయ పదములను ( ) కుండలీకరణములచే వేఱు చేయుదురు.

ఉ:- సైతేయుఁడు (సీతాపుత్రుఁడైన కుశుఁడు) యాగేయాశ్వమును పట్టి బంధించెను.

## విశేష్యములు (నామవాచకములు.)

## అభ్యాసము

1. ? ఇది యేచిహ్నము?
2. : ఇది యేచిహ్నము?
3. ! ఇది యేచిహ్నము?
4. " " ఇది యేచిహ్నము?
5. ( ) ఇది యేచిహ్నము?

6. పై చిహ్నములలో నేవి యేయే పదముల తరువాత నుపయోగింతురు ?

ఈ క్రింది వాక్యములలోని దోషములను సవరింపుము.

1. ఆవు మంచిది కాదు.
2. నీవు అన్నము తిన్నావా :
3. ఔరా ! వాఁడెంత తెలివైనవాఁడు.
4. నేను బడికి పోవుదునా.
5. "రాముఁ డెంత మంచివాడు"
6. వాఁడెవఁడు !
7. నేను అన్నము తింటిని ?

---

## 16. క్రియల శబ్దలక్షణము.

వాక్యముయొక్కయు, అందలి పదములయొక్కయు స్వరూపమును తెలుపునది శబ్దలక్షణము.

వాక్యములో కర్తృస్థక, కర్మార్థకము పదముల వాచక, వచన, విభక్తులేవో ప్రతిశబ్దమునకు తక్కిన శబ్దములతోఁ గల సంబంధమెట్టిదో వివరముగా చెప్పునదే శబ్దలక్షణము.

రాముఁడు పాఠములు చదివెను.

ఇందు చదివెను అనుక్రియ భూతకాలము, ప్రథమ పురుషము, మహద్వాచకము ఏకవచనము. పాఠములు అను కర్మతోను, రాముఁడు నుకర్తతోడను సంబంధించినది.

చిలుకలు కూయుచున్నవి.

కూయుచున్నవి క్రియ వర్తమానార్థక క్రియ, ప్రథమ పురుషము, అమహద్వాచకము, బహువచనము. చిలుకలు - అను కర్తతో సంబంధము గలది.

నీవు పద్యమును వ్రాసితివి.

వ్రాసితివి క్రియ మధ్యమపురుష క్రియ, ఏకవచనము, మహద్వాచకము, మహతీ వాచకముకూడ. పద్యమును - అను కర్మతోను, నీవు అను కర్తతోను సంబంధించినది.

ఇట్లే మిగిలినవి యూహించుకొనునది.

## అ భ్యా స ము

1. కవిరాజుచే పద్యములు వ్రాయబడగలవు.
   దీనికి శబ్ద లక్షణము తెలుపుము.
2. శబ్ద లక్షణ మన నేమి ?
3. భూతవర్తమాన భవిష్యత్కాలములలో మూఁడు పురుషములు వచ్చునట్లు మూఁడు వాక్యములు వ్రాసి, శబ్దలక్షణము వ్రాయుము.

---

## 17. ప్ర త్య క్ష ప రో క్ష సం భా ష ణ ము లు.

### ప్ర త్య క్ష సం భా ష ణ.

రాముఁడు నిలిచి "గురూత్తమా! తాటక నెట్లు సంహరింపవలెను" అని విశ్వామిత్రు నడిగెను.

ఇందు రాముఁడు విశ్వామిత్రునితో ప్రత్యక్షముగా అనిన మాటలుగలవు గాన ఇది ప్రత్యక్షసంభాషణ వాక్య మనఁబడును.

## పరోక్ష సంభాషణము.

అంత విశ్వామిత్రుఁడు అతఁడు తాటకిని బాణముతోఁ గూలవేయ వలయుననియు, నట్లు చేసినఁ దాటకి తప్పక చచ్చుననియు బదులు చెప్పెను.

ఇందు విశ్వామిత్రుఁడు రామునితోననిన మాటలను వేఱొకఁడు మఱియొకనితో పరోక్షముగా చెప్పెను గాన ఇది పరోక్ష సంభాషణ వాక్యము.

## సంభాషణలను నిర్దిష్టముగా మార్చుట.

### ప్రత్యక్ష సంభాషణ.

రాముఁడు లక్ష్మణునితో" నేను వెడలుచున్నాను, నీవు వేగముగా రమ్ము, నీకు ధైర్యము కలదా? ఆ రాక్షసి యెంత భయంకరురాలు! మనలను దేవుఁడు రక్షించుగాక'' ఇది రామలక్ష్మణుల నడుమ జరిగి; ప్రత్యక్ష సంభాషణ.

### దీని పరోక్ష సంభాషణ.

రాముఁడు లక్ష్మణునితో తాను వెడలుచున్నాననియు అత వేగముగా రమ్మనియు చెప్పి యాతనికి ధైర్యము కలదాయని ప్రశ్నిచెను. మఱియు మిక్కిలి భయంకరురాలని యాశ్చర్యము వెలిబుచ్చి తమ్ములను దేవుఁడు రక్షించుఁగాక యని ప్రార్థించెను.

## అభ్యాసము

ఈ క్రింది వాక్యములను పరోక్ష సంభాషణలోనికి మార్చుము.

i. గురువు శిష్యునిఁబిలిచి 'నీవు జాగ్రతగాఁ జరుపుచుండుము' అనెను.

ii. 'వాఁడు స్నేహితునితో 'నేను రేపు నీతో వత్తునా'? అనెను.

iii. అంత నతని మిత్రుఁడు 'తప్పక రమ్ము' అనెను.

iv. వాఁడు 'నీ వాత్సల్య మెంతగాఢమైనది!' అనెను

v. అతని మిత్రుడు 'మన మైత్రి చిరకాలము నిలుచుఁగాక' అనెను.

ఈ క్రింది వాక్యములను ప్రత్యక్ష సంభాషణములోనికి మార్చుము.

i. రాముఁడు గోపాలునితో తాను తెలివైన వాఁడనని చెప్పెను.

ii. గోపాలుఁడు రాముని మఱుసటిదినము తన యింటికి రావలెనని కోరెను.

iii. రాముఁడు గోపాలుని నెందులకని ప్రశ్నించెను.

iv. గోపాలుఁడు రాముని సౌజన్యమున కాశ్చర్యము తెలిపెను.

v. రాముఁడు గోపాలునితో వారికి దైవమనుకూలుఁడగుగాక యని ప్రార్థించెను.

## 18. సామాన్యవాక్యముల విచ్ఛేదన.

) యన్నయును నీవును బదునాలుగేండ్లు (నన్ను) అరణ్యంబునఁగాపాడిరి.

ఇందు 'కాపాడిరి' అను నొక్క సమాపకక్రియమాత్రమే కలదు. అందుచే నిది సామాన్యవాక్యము.

సామాన్యవాక్య విచ్ఛేదనను ఈ క్రిందివిధముగా పట్టికలో చూపవచ్చును.

మిక్కిలి దుష్టుఁడైన ఆ బాలుఁడు తోడివారగు పిల్లలను క్రూరముగా బాధించుచుండెను.

అన్న! పాపాత్మురాల నన్ను నిష్కారణముగా అడవిలో విడిచి రమ్మనునే!

ఎల్ల కార్యములు పరామర్శించి చేయుమీ.

| కర్తృ భాగము | | | | క్రియా భాగము | |
|---|---|---|---|---|---|
| కర్త | | కర్మ | | క్రియ | |
| కర్తృ సంబంధ | కర్తృ పదము | కర్మ సంబంధ పదములు | కర్మ పదము | క్రియా సంబంధ పదములు | క్రియా పదము |
| 1. మిక్కిలి<br>2. దుష్టుఁడైన<br>3. ఆ | బాలుఁడు | తోడివారగు | పిల్లలను | క్రూరముగా | బాధించుచుండెను |
| ఎల్ల కార్యములు పరామర్శించి చేయుమీ | అన్న | పాపాత్మురాల | నన్ను | నిష్కారణముగా అడవిలో విడిచి | రమ్మనునే |

# విజయాంధ్ర వ్యాసరచన దీపిక

## 1. వాదోపవాద సంభాషణలు

ఇరువురు వ్యక్తుల నడుమ జరుగు సంభాషణా రచన మూలమున విద్యార్థులు వక్తృత్వపాటవమును రచనా చమత్కృతులతో మేళవించి భాషాభివృద్ధి గావించుకొను అవకాశములు గలవు. ఈ సంభాషణలు వివాదాంశముల గూర్చి జరిగెనేని వానిని గావించువారి హేతువాదనా చాతుర్యము, వారి అభిప్రాయములలో ప్రధానాప్రధా నాంశముల విశిష్టత, కార్యకారణ సంబంధ విశదీకరణ మొదలగునవి వ్యక్తములుగా గలవు. అందుచే విద్యార్థు లిట్టి సంభాషణలను, ముఖ్యాంశములను, అందును వివాద విషయకాంశముల గూర్చి జరిపి వానిని లిఖించు విధానము లను నేర్చిన, వక్తలై, రచనాకౌశలులై, దేశసేవయందు ప్రశంసనీయమగు, కృషిగావించి, తమ వ్యక్తిగత గౌరవ మును, దేశీయ గౌరవమును నెక్కువ జేయు ఆదర్శ పౌరు లగుట కవకాశములు గలవు.

ఈ సంభాషణలు ఇరువురు వ్యక్తులకేగాక ముగ్గురు నలుగురు వ్యక్తుల నడుమగూడ జరుగవచ్చును. ఎందఱు వ్యక్తులున్నను, వారియందొక్కరే యెక్కువగా సంభా షించుచు దక్కినవారు మిక్కిలి తక్కువగ సంభాషించు

టయు సంభాషణల రచనలో
సంభాషించు పాత్రల ప్రాముఖ్యమ
నిరూపణను బట్టియు, సంభాషణలు
సంభాషణలయందు భావసూచన
ప్రాధాన్యమెక్కువ. ఈ నియమ
షణ రచనలు, ఏకాంకికల ర
నాందీ పూజలు, ప్రథమసోపానము

గానము, చిత్రలేఖనము - వీనిలో
మనస్సు నానందింప

లక్ష్మీసరస్వతులను బాలి

లక్ష్మి :-సఖీ, నిన్న నేను మా న
మందిరమున నేర్పాటు గా
ప్రదర్శనమును జూడబోయి
గాంచి, యమితానందము
లతో నున్న వానిని దిల
యానందాతిశయ మనిరా
దగిన దేగాని వర్ణింపనలవి క

సరస్వతి :-సఖీ, నేను నిన్న సాయం
గాయకుని జంత్రగాత్రగాన
గ్రోల గలిగితిని. మా యిం
కుడు మా నాయనగారి స్నే
నాడు. ప్రసంగ వశమున నాతని క

తెలిసికొని, దాని చవిగొనగోరిన మాతండ్రిని దృష్టి గావింప నిగర్వియగు ఆ గాంధర్వ విద్యాపారంగతుడు మా యింటగల వీణను గైకొని జంత్రగాత్రముతో తన గానమును మేళవించి కిన్నరగాత్రమును హసించు రీతి పాడి మమ్మానంద సంద్రమున నోలలాడించె. వాణియె సాక్షాత్కరించెనేమో యనిపించినది.

లక్ష్మి :-ఔను ప్రత్యక్ష సరస్వతి యెదుట నొక గానసరస్వతి మూర్తీభవించినది.

సరస్వతి :-చాలునమ్మా నీ పరియాచికములు – నేను నామమాత్ర సరస్వతిని. ఆతడు కళా నైపుణ్యమున మూర్తీభవించిన వాణీయవతారము. నిన్ను పిలుచుకొని వచ్చుటను మీ గృహమునకు రివ్వన యెగిరి వచ్చితిని. గాని నీ వెచ్చటికో వెడలితివని యెుకించుక నిరుత్సాహముచెంది యింటికి మరలి వచ్చితిని. గానము జరుగునంతసేపు నానంద పరవశనైయున్నను నీవుకూడ నావద్దయుండిన నెంత బాగుండునని యనుకొనుచునే యుంటిని.

లక్ష్మి :-నేనుకూడ అట్లే చిత్రలేఖనముల జూచునప్పుడు భావించితిని. ఈ రెండు కళాప్రదర్శనములు నొక్క రోజుననే యేక కాలముననే జరుగునట్లును మన మిద్దఱము కలిసియుండకుండు రీతిని సంభవించుట దురదృష్టమే.

సరస్వతి:-అట్లను కొనవలదమ్మా! చిత్రలేఖన ప్రదర్శన మింకను సాగుటవలనను, ఈ గాయకుని కౌశల ప్రదర్శనమున కొక గానకచేరి జరుగు ప్రయత్నము లుండుటచేతను వానిని మనమిద్దఱము కలిసి చవి గొని యానందించు నవకాశములు గలవు.

లక్ష్మి:-మంచిదమ్మా! అట్లయిన మనము ధన్యులమే. చిత్ర లేఖన కళలు మరపునకు రాకున్నవి. వానిని దర్శించుటవలన గలిగిన యానందమే మిక్కిలి యుత్కృష్టమని నా నమ్మకము.

సరస్వతి:-చిత్రవిలోకనమున గలుగు నేత్రానందమా ఉత్కృష్టము. ఊఁహు. గానకళాశ్రవణమున గలుగు మానసికానందమే సర్వోత్కృష్టము. అనిర్వా చ్యము. అనుభవయోగ్యము.

లక్ష్మి:-సఖీ!-యేమి నీ సాహసము! శ్రవణానందమా, నేత్రానందముకంటె యెక్కువ? నేత్రానంద మొనర్చు చిత్రములు భావ ప్రపంచమున ననిర్వాచ్య ములును, వర్ణనాతీతములు నగు భావముల నుత్పా దింపలేదా? మహాకవుల కనుభవనీయములగు ప్రకృతి గానరసంబుల నుత్పాదింపలేదా? జీవక ళలతో నొప్పు చిత్రములు తప్పక మనతో మాట లాడునట్లగపడును. వానిమాటలు మన యంతరింద్రి యములకు విదితములు.

సరస్వతి :-గాన మహిమను దక్కువజేయుట సాహసము. చెలీ! గానము భావ ప్రపంచమున చిత్రముల నుత్పాదించును. త్యాగరాజకీర్తనల ప్రభావము దిలకింపుము. అవి శ్రవణానందము కలుగజేయు నంతకాల మర్ధనిమీలిత నేత్రులమై హృదయకమలమున నిలచిన శ్రీ రామమూర్తిని ఆతని పాదముల చెంత భక్తిపరవశుడై గానముచేయు త్యాగయ్యను మనము భావప్రపంచమున జూచుట లేదా? సర్వోత్కృష్టమగు గానరవము హృదయ పటమున దివ్య మోహనాకారముల సృష్టించగల శక్తిగలది.

లక్ష్మి :-దివ్యమోహనాకారము ప్రత్యక్షముగా మృదు మధుర వాక్కుల బ్రసంగించురీతి దోచుట ప్రకృతి విరుద్ధము గాదు. ఇందు నేత్రానందము శ్రవణానందమును గూడ కలుగ జేయును.

సరస్వతి:-శ్రవణానందము నేత్రానందకరములగు చిత్రముల జిత్రించుట లేదా ?

లక్ష్మి :-నేత్రానంద మాంబాలగోపాల మందఱను ముగ్ధుల గావించును. అందుచే నది సర్వోత్కృష్టము.

సరస్వతి:-శ్రవణానందము మనలను నానంద పారవశ్యమున ముంచి యొక విధమగు మైకమునుకూడ కలుగ జేయును. అందుచే నదియే యద్వితీయమని నా యూహ.

(అంత కమల ప్రవేశించును.)

కమల :-ఏమమ్మా! దేనిని గూర్చి మీరిట్లు వాదించు చున్నారు? నాకు కొంచెము చెప్పగూడదా?

లక్ష్మి :-నా ప్రశ్నకు సూటిగ జవాబు చెప్పుము. శ్రవణా నంద మెక్కువా? నేత్రానంద మెక్కువా? - వేగ ముగ జవాబు చెప్పు.

సరస్వతి :-చిత్రలేఖనమా? గానమా! ఏది మనమున కెక్కువ ఆనందదాయకము. ఏదే? శీఘ్రముగ బ్రత్యుత్తరమీయుము.

కమల :-సఖులారా! నేను మిమ్మొక ప్రశ్ననడుగు చున్నాను. దాని కెవరు తగిన బ్రత్యుత్తరమును శీఘ్ర ముగ నిచ్చెదరో వారి పక్షమును నేనవలంబించి ప్రత్యుత్తరమీయగలను. ఏదీ చూతము. జిలేబి మంచిదా? లాడువ మంచిదా! ఏదెక్కువ ఆనం దము నిచ్చును.

లక్ష్మి, సరస్వతి :-(ఇరువురు) చాలునమ్మా. నీ పరియాచి కములు, వేళాకోళములు! ఇదియే నీవు చేయు తీర్పు. దీనిని చెప్పుటకా దివ్యలోకమునుండి మానవ లోకమునకు దిగివచ్చు దేవతవలె మీ యింటినుండి యిచ్చుటకు వచ్చినది.

(ముగ్గురు కిలకిల నవ్వుదురు)

(ఇంతలో ఉపాధ్యాయినియగు కాంతమ్మ ప్రవేశము.)

కాంత:-ఏమమ్మా ఆనందమును పట్టజాలకున్నా రే-ఏమీటా కిలకిలలు, వికవికలు, సమాచారమేమి!

(అంత వారు జరిగినదానిని కాంతమ్మకు దెల్పుదురు)

కాంత :-బాగున్నది మీ వాదోపవాదములు. కమల మీకు మంచి ప్రశ్నయే వేసినది. నేను దానినే మరల.....

లక్ష్మి :-సరి-బాగుందమ్మగారూ...మీరు కూడా..........

కాంత :-కాదమ్మా నా తీర్పు వినండి. కమల ప్రశ్నకు వలయు జబాబు చెప్పుట యెంత కష్టమో లక్ష్మి సరస్వతుల ప్రశ్నకు దగు ప్రత్యుత్తర మిచ్చుటయు నంత కష్టమే. చిత్రింపబడిన చిత్రము నేత్రానంద మొనర్చి యవ్యక్త గాన మాధుర్యమున మనమును రంజింపజేయును. గానము శ్రవణానంద మొనర్చి యగోచర దృశ్యముల భావ ప్రపంచమున గల్పించి మనము నాకర్షించును. దేనికదియే మహోత్కృష్టము. ఇవి కల్పించు ఆనందము బ్రహ్మానంద తుల్యము - ఇక పాఠశాలకు పోవుదము రండు.

## అభ్యాసము

i. ఈ క్రింది సంభాషణల నూహించి వ్రాయుడు :—

1. మనుష్యునకు ఏది ఎక్కువ ఉపయోగపడును. ఎద్దుల బండి, జట్కాబండి, సంభాషణ.

2. కలమా-కత్తియా - ఏది ఎక్కువ కార్యసాధకము. ఇరువురు మిత్రుల సంభాషణ.

3. కాకి - పంజరములోగల చిలుక - సౌఖ్యమును గూర్చి వీని ప్రసంగము.
4. కలము - పెనసలు - ఏది ఎక్కువ ఉపయోగకరము - ఇరువురు బాలుర సంభాషణ.
5. ఊర కుక్క - పెంపుడు కుక్క - స్వేచ్ఛనుగూర్చి వీని సంభాషణ.
6. రైలుబండి - మోటారుబండి - ఇందేది మంచి ప్రయాణ సాధకము-ఇరువురు బాలికల సంభాషణ.
7. హరికేన్ లాంతరు-ఎలక్ట్రిక్ లైట్ (విద్యుద్దీపము)-వీని నడుమ జరుగు సంభాషణ.
8. గాడిద - గుఱ్ఱము - మనుజుని కుపయోగపడు రీతిని గూర్చి వీని సంభాషణ.

ii. ఈ క్రింది యంశముల గూర్చిన సంభాషణల నూహించి సంగ్రహముగ వ్రాయుడు :—

1. స్వప్నములు, 2. దయ్యములు, 3. తీరుబడికాలపు ఉపవృత్తులు, 4. ముక్తి, 5. శక్తి.

iii. ఈ క్రింది యంశముల గుఱించి యిరువురు బాలికలకు గాని, బాలురకుగాని జరుగు సంభాషణ నూహించి వ్రాయుడు :—

1. పాఠశాల తనిఖీ, 2. పాఠశాలలోని ఆటపాటలు, 3. బాలభటోద్యమము, 4. పౌరసత్వ విధాన

ములు, 5. గణితముయొక్క ప్రాముఖ్యము, 6. చరిత్ర యొక్క ఉపయోగము, 7. శాస్త్రాభివృద్ధి, 9. విశ్వ మానవ ప్రేమ, 10. భారతీయ నాగరికత, 12. మత ప్రాముఖ్యము, 13. నైతిక జీవనము, 14. అన్యోన్య సహకారావశ్యకత, 15. ప్రజాపరిపాలనా విధానము.

iv. ఈ క్రింది వివాదాంశములగూర్చి వాదోపవాదముల నూహించి వ్రాయుడు :—

1. నాటకము - సినీమా ఏ దెక్కువ ఉపయోగ కరము, 2. చేతి పరిశ్రమలు - యంత్ర పరిశ్రమలు మన దేశమున ఏవి ఎక్కువగానుండవలెను, 3. వృత్తి విద్య - కళాశాల విద్య - ఏ దెక్కువ వ్యాప్తినందవలెను, 4. కవులా - కర్షకులా - ఎవరెక్కువ సేవ చేయువారు 5. విద్యార్థుల శిక్షించుట, ఉచితమా, కాదా, 6. ప్రజా పాలనమా - నియంతృత్వమా - ఏది మంచి పరిపాలనా విధానము, 7. సమ్మెలుండవలెనా లేదా ? 8. యోగి- భోగి ఎవరెక్కువ యానంద మనుభవింతురు ?

## 2. పత్రికలో సారస్వత గ్రంథ సమాలోచన

మాదిరి

......తేది.　　　......పత్రిక.　　　పేజి.

### గ్రంథ సమీక్ష

గ్రంథము...కథల సంపుటి...గ్రంథకర్త మహారాజశ్రీ...గారు. మూల్యము రు. 1-0-0. ప్రకాశకులు ......అండ్ కో...పట్నము.

ఈ గ్రంథమును రచించిన శ్రీ...గారు ఆంధ్ర భాషాభిమానులకు జిరపరిచితులు. 'జగమెఱిగిన బ్రాహ్మణునకుజందెంబేలా?' యనురీతి వీరి రచనలగూర్చి విపులమగు సమీక్షయనావశ్యకము కాగలదు.

ఈ గ్రంథమునందైదు కథానికలున్నవి. తొలికథ పౌరాణికము, రెండవది చారిత్రకము, మిగిలిన మూడును సాంఘికములు. పౌరాణికగాథయందు మేనక విశ్వామిత్రులకథ క్రొత్తరూపమును దాల్చి యాధునిక, సాంఘిక సాంప్రదాయముల ననుసరించు చున్నది. ప్రాత సాంప్రదాయములయందు ప్రజల యాదరాభిమానములు సన్నగి

లుటవలన నూతనసాంప్రదాయములనె కథకు ముడివెట్టితి నని గ్రంథకర్త యుపోద్ఘాతమున నుద్ఘాటించినాడు. ఆధుని క కథారచనలో నిదియొక యపూర్వకౌశలముగ గన్పట్టుచు న్నదేమో! చారిత్రక, సాంఘిక కథావస్తువులు సముంచస ములుగనే యున్నవి.

వస్తురచనయందే గాక కథకుడు పాత్రపోషణల విషయమునగూడ సర్వస్వాతంత్ర్యములను బ్రదర్శించినాడు. పాత్రపోషణప్రాతపద్ధతుల ప్రకారము గుణసూత్రనిర్వచన పూర్వకముగాదు. అనుభవైకవేద్యమై పదసంఘటనల యర్థ గాంభీర్యము లందే యిమిడియున్నది. వ్యక్తుల చేతలబట్టి వారి గుణగణములు వ్యక్తపడునుగాని, వారిచేతలు వారిగు ణనిర్వచనముల కుదాహరణలు మాత్రముగ నుండజాలవు. ప్రతి కథయందును నాయికానాయకుల యాదర్శములను వారివారి చర్యలు ప్రస్ఫుటములుగావించుచున్నవి.

రసపోషణవిషయమున గ్రంథకర్త తగిన జాగరూకత వహించినట్లు గన్పట్టదు. రసపోషణ నీరసముగాకున్నను పుష్టివంతము మాత్రము కాజాలదు. ఆయారసముల నుత్పా దించు వర్ణనశయ్యాను లింకను దగునభివృద్ధి గాంచవలసి యున్నది. చారిత్రకకథయగు "సంయుక్త" యందు త్రండి కూతుల సంభాషణమాత్రము చదువరుల మనముల నాక ర్షింపదగియున్నది. సాంఘిక కథానికలందు వ్యర్థజీవి; భారత వనిత; అభినవ కుంభకర్ణుడు, అను వానియందు ఆధునిక

యువకుల నిరర్థక కృషి, యువతుల యనుకరణజీవనములు, కార్మికుల మాంద్యము సూచింపబడినవి. వానిని సంస్కరించు మార్గములను మాత్రము రచయిత గుర్తింపజాల కుండెనని చెప్పక తప్పదు.

గ్రంథమున రచయిత వాడినభాష గ్రాంథికమా? వ్యావహారికమా? రెండింటి మిశ్రమమా? యను శంకల గలిగించుచుండును. పూర్వసాంప్రదాయముల నాదరించు పండితులను, స్వేచ్ఛాపరతంత్రులగు ఆధునిక రచయితల నందఱను మెప్పించుటకు గ్రంథకర్త యుద్దేశించె నేమో యను నట్లున్నది. ఇతరుల యభిరుచుల కొఱకు వక్తిగత రచనా విధానము, భాషావిశిష్టతమార్చి యనుకరణమార్గ మవలంబించుట మంచిమార్గముకాదని మాయభిప్రాయము.

కథారచనమునను, వస్తు, పాత్ర, రసపోషణల యందు భాషయందుగల యాలోపములు కొలదిగానుండినను మొత్తముపై గ్రంథము కొన్ని క్రొత్తపోకడలను గల్పించి హృదయముల నాకర్షించు సన్నివేశములను గలిగియుండుటచేతను, రచయితకు పదములతో భావచిత్రములను గల్పించు భాషాశిల్పినైపుణ్యము కొంత యలవడియుండుటచేతను ఈ గ్రంథము ఆధునికసారస్వతమున గణనీయమగు స్థానము నలంకరింప గలదనుటలో సంశయములేదు.

ఇట్లు,
ఒక భాషాభిమాని.

# 3. సారస్వత గ్రంథ విమర్శ

## మనుచరిత్ర విమర్శనము

ఆంధ్రసారస్వత చరిత్రమున స్వర్ణయుగమనదగు రాయలయుగము లేక పూర్వప్రబంధయుగమున ఈ ప్రబంధ రాజము ఆంధ్రకవితా పితామహుఁడని ప్రసిద్ధిగాంచిన అల్లసాని పెద్దన కవిచే రచింపఁబడినది. మనుచరిత్ర మన పెద్దనయు, పెద్దనయన శ్రీకృష్ణదేవరాయలును మన భావ ప్రపంచమున సాక్షాత్కరింపగలరు. వారి నిరువురను దలఁచిన "ఎదురైనచో దన మదకరీంద్రము నిల్పి కేలూత యొసగి యెక్కించు కొనియె"నను పద్యము తలపునకు వచ్చును. పెద్దనయందు రాయలకుగల గౌరవ మపారము. రాయల యాస్థానమున నష్టదిగ్గజములని వాసిగాంచిన కవి చంద్రులయందు పెద్దన పెద్ద 'పెద్దనవలె కృతిచెప్పిన పెద్దనవలె అల్పకవిని పెద్దనవలెనా'యను నాలోచనలను గల్పించు సుప్రసిద్ధ ప్రబంధ కవీశ్వరుఁడు.

మనుచరిత్రలోని కథకు మారన మార్కండేయపురాణములోని సారస్వతమనువు వృత్తాంతము మూలము. మూలములో కొలది పద్యముల నిమిడినకథ, ప్రబంధమున వందలకొలది పద్యపంక్తుల వ్యాప్తిగాంచినది. మారన గ్రంథమున నారంభమైన కథాప్రవాహము పెద్దన కవిత్వధారల సంభవృష్టిచే మహాప్రవాహమై గంభీరమై యొడ్లనొరయుచు బ్రవహించు కవితావాహిని యైనది.

ఈ మహాప్రబంధమందలి వస్తుపోషణమున కవిచా

తుర్యమున కంతగా తావులేదు. పాత్రపోషణయందు కవి తన ప్రతిభను పూర్తిగ వెలయించినాఁడు. మనుచరిత్ర నెఱుఁగని యాంధ్రుడరుదు. దానిని జదివిన పిమ్మట భావ ప్రపంచమున వరూథినీ ప్రవరాఖ్యుల సాక్షాత్కారమునందలి చదువరియు సాధారణముగ గానరాడు. పెద్దన లేఖిని యందే మహాత్మ్యమున్నదోగాని చిత్రకారుని ప్రతిభ, గాయకుని యమృతగానమహిమ దాని నాశ్రయించిన వనవచ్చును. అతడు చిత్రించిన వ్యక్తుల వర్ణనలు యావ్యక్తుల జీవప్రతిమలను సృష్టించుశక్తి గలవి.

"ఆపురిబాయకుండు మకరాంకశశాంక మనోజ్ఞమూర్తి...ప్రవరాఖ్యుడలేఖ్యతనూవిలాసిమై" యనుటతో డనే ప్రవరుఁడు మన యెదుట సాక్షాత్కరించును. అతడు నిశ్చయముగ నలేఖ్యతనూ విలసితుఁడే...ప్రవరుఁడు హిమగిరి తటంబుల సంచరించు నవసరమున "మృగమద విభవ ద్విగుణిత...మారుత మొలసెన్" అను లేగాలుల వాసన గొట్టిన మానినీ తిలకముగు వరూథినిని...తలోదరిన్" అను పద్యమున దనయెదుట సాక్షాత్కార మొనర్చు కొనినాఁడు ప్రవరుఁడు. ఈ సమావేశము సిద్ధుడొసగిన రసలేపన మహాత్మ్యమున గలిగినది. ఆసిద్ధునిది వచఱకే మనము "ముడిచినయొంటి కెంజడమూయముప్వన్నె మొగము తోలు........చేరెదద్దే హామాషధసిద్ధుడొకడు" అని పఠించి వాని సాక్షాత్కారమును మన మనోదర్పణముల గావించుకొనియే యుంటిమి.

శిల్పి తన యులితాకుడుల మనోహర రూపము సృష్టించురీతి పెద్దన తన పదముల వాడుకచే వ్యక్తుల సన్నివేశములను జీవకళలతో, సహజ గాంభీర్యములతో సాక్షాత్కరించు రీతి మన యెదుట జిత్రింపగలిగినాడు. పదములతూగులో మార్దవములో, శయ్యలో నొక విధమగు అమరగానము స్ఫురించుటాశ్చర్యముగాదు.

కవిత్వరచనా కౌశలమున గురుశిష్యులగు పెద్దన, రామరాజభూషణుల సరిపోల్చుట యప్రస్తుత ప్రశంస కానేరదు. ఇరువురును సుమారు సమాన ప్రతిభావంతులే. శిష్యుడు కొన్ని యెడల గురువునుమించి నట్లును, అట్టిశిష్యుని గలుగు గురువు తన నిరుపమాన శక్తి నిల్పుకొని నట్లును మనము భ్రమపడుటయు నాశ్చర్యముకాజాలదు. పెద్దనకుగల వస్తుపోషణా కౌశల్య మతని శిష్యునికృతియందు గానరాదు. వసుచరిత్రయందు వస్తువివరణ మించుమించు అన్యమేమో. రామరాజభూషణుని కవితాశిల్పచమత్కృతులతని గురువుగారి కృతియందంతగా గన్పట్టజాలవు. వీరిరువురి కౌశలముల తారతమ్యముల నిరూపణకై యొక్కవాక్యమును బల్కనజాలునేమో. పెద్దన జాతిరత్నములనేరి దామముగా గూర్చి, నాయకమణిని సంధించి ఆంధ్రభాషాయోష కంఠము నలంకరించినాడు. ధన్యుడైనాడు. భట్టుకవి నవరత్నములను కొల్లలుగా బంగారు పళ్లెరముల నింపిదెచ్చి యాంధ్రభాషారమణి శీర్షముపై ద్రిమ్మరించినాడు!—ఇదియే వీరి తారతమ్యము.

---

## 4. సభా కార్యక్రమ, తీర్మానముల రచన

మాండలిక ప్రాథమికోపాధ్యాయసంఘ మహాసభ.

### కార్యక్రమము

2—4—1948

ఉదయం 6-30 ప్రార్థన - పతాకోత్సవము.

7-30 ఆహ్వానసంఘాధ్యక్షుని స్వాగతోపన్యాసం

8-15 విద్యావిషయక ప్రదర్శనమును తెరచుట

9-15 కార్యనిర్వాహక సంఘ సమావేశము - చిత్తు తీర్మానములు.

11-15 భోజనములు.

మధ్యాహ్నము 1-30 కార్యనిర్వాహక సంఘసమావేశము— తీర్మాన నిర్ణయములు.

3-30 మహాసభ బహిరంగసమావేశము.

6-45 వినోదప్రదర్శనములు.

రాత్రి 9-30 నాటకప్రదర్శనము 'ఆంధ్రజ్యోతి'

మహాసభ బహిరంగసమావేశ కార్యక్రమమ

3-4-48 3-30 దైవప్రార్థన.

| | | |
|---|---|---|
| మధ్యా | 3-45 | అధ్యక్షునియామకము. |
| హ్నము | 4-30 | అధ్యక్షుని ప్రారంభోపన్యాసము. |
| | 4-30 | ఇతరఉపన్యాసకులు. |
| | 5-15 | తీర్మానములు. |
| | 6-45 | వినోదప్రదర్శనములు. |
| | 7-30 | అధ్యక్షుని అంత్యోపన్యాసము. |
| | 7-45 | ముగింపు. అధ్యక్షునకభివందనసమర్పణము |

## తీ ర్మా న ము లు.

1. జీవితావసర సరకుల ధరలు మితిమీరి పెరిగి నందున ప్రాథమికోపాధ్యాయుల కఱవుభత్యములను నూటి కిరువదిరూప్యముల చొప్పున నెక్కువచేయవలసినదని ప్రభుత్వమువారిని సభవారేక గ్రీవముగా కోరుచున్నారు.

ప్రతిపాదకులు (శ్రీ).................గారు

బలపఱచినవారు (శ్రీ)..............గారు

తీర్మానమేకగ్రీవముగా నామోదింపబడినది.

2. పెద్ద పెద్ద పట్నములలో ఏబదిరూప్యములకు తక్కువ నెలజీతములుగల ప్రాథమికోపాధ్యాయులకు నెల కైదు రూపాయలచొప్పున ప్రతియుపాధ్యాయునకు ఇంటి అద్దెను ప్రభుత్వము వారేర్పాటు చేయవలసినదని యీసభ వారు కోరుచున్నారు.

ప్రతిపాదకుడు శ్రీ..................గారు
బలపఱచినవారు శ్రీ.............గారు

3. ఉపాధ్యాయుల పిల్లలకు పాఠశాలలలో నుచితముగా విద్యను గఱపు ఏర్పాటులను గావింపవలెనని ప్రభుత్వమువారి నీ మహాసభవారు కోరుచున్నారు.

ప్రతిపాదకుడు శ్రీ..................గారు
బలపఱచువారు శ్రీ.............గారు

ఇతర తీర్మానములు.

4. ........................................
5. ........................................
6. ........................................

| | |
|---|---|
| స్థలము.........., | అధ్యక్షుడు |
| తేది............ | మాండలిక ప్రాథమికోపాధ్యాయ మహాసభ సమావేశము. |

5. ఆహ్వాన సంఘాధ్యక్షుని ఉపన్యాసము.

........మాండిలిక ప్రాథమికోపాధ్యాయులసభా సమావేశమును నేడీపురమున పురజనుల సహకారముతో ఆహ్వాన సంఘమువారేర్పాటు చేయగలిగినారు. దీని నలంకరింప మండలమున గల వివిధతరగతుల ప్రాథమికోపాధ్యాయులను కోరుచు మేముపంపిన ఆహ్వానప్రతికలనందుకొని ఎన్నిపనులున్నను మాయందు దయయుంచి నేటి సమావేశమును జయప్రదముగా జరుపనిశ్చయించి వచ్చిన యుపాధ్యాయ బృందమునకాహ్వాన సంఘము తరపున నా హృదయపూర్వక స్వాగతమునంద జేయుచున్నాను.

ఉపాధ్యాయ సోదరులారా! నేడు మనము మంచి క్లిష్టసమయమున నిచ్చట సమావేశమైతిమి. 1947 ఆగష్టు 15-వ తేదీ నుండి మన భారత దేశము స్వాతంత్ర్యము నందగలిగినది. స్వాతంత్ర్యభానూదయముతో భారతీయసంఘమున నూతన వికాసముగలిగినది. ప్రజల, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, నైతికజీవన విధానములందు మార్పులురానున్నవి. అన్ని మార్పులతోబాటు జాతీయ విద్యావిధానమునకూడ నవసరములగు సంస్కరణములు గావింపబడుచున్నవి.

స్వతంత్ర భారత భావిపౌరులను దయారుచేయుపని ముందుగ ప్రాథమికోపాధ్యాయుల విధికృత్యమైయున్నది. పవిత్రమగు నీ బాధ్యతను జయప్రదముగ నిర్వహించి జాతీయ అంతర్జాతీయ ఖ్యాతిని దేశమునకు గడించుభారము వీరి భుజాస్కంధముల పైబడినది అట్టి బాధ్యతను నిర్వహించు నవసరమున ఈ యుపాధ్యాయులు కొన్ని హక్కులను గల్పింప ప్రభుత్వము వారిని పౌరులనుగోరుట యసమంజసముకాదు.

ఇట్టి పరిస్థితుల సందర్భమున జరుగు సమావేశమున కధ్యక్షత వహించి, విద్యాధికులు ననుభవశీలురు నగుటచే తమ యమూల్యమగు సలహా నిచ్చి యుపాధ్యాయు లేర్పరచిన కార్యక్రమమును జయప్రదముగ నడిపించి సభవారు చేయు తీర్మానములను ప్రభుత్వము వారి కందచేయు విధానముల గల్పింప, మన కందఱకు జిరపరచితులును, మాండలిక విద్యావిశారదులగు వారిలో నొకరై యపర శారదావతారమనదగు మహారాజశ్రీ......పంతులుగారిని అధ్యక్షపీఠము నలంకరింప మీ యందఱి తరఫున నేను వందనపూర్వకముగా గోరుచున్నాను. (కొందఱు సభ్యులు తీర్మానమును బలపఱుప హర్షధ్వనుల నడుమ శ్రీ.........గారు అధ్యక్షపీఠము నలంకరింతురు. ఆహ్వాన సంఘాధ్యక్షులు వారిని పుష్పమాలాలంకృతులుగ నొనర్చ అందఱును తిరిగి హర్షధ్వనుల గావింతురు.

అంతట సభాకార్యక్రమ నిర్వహణ మారంభమగును.

---

## 6. వీడ్కోలు వినతి పత్రిక సమర్పణ

పట్టణ ప్రభుత్వ ఔషధాలయమున ప్రధాన భిష గ్వరులగు మహా రాజశ్రీ గారికి పట్నమునకు బదలీకాబడిన సందర్భమున పుర ప్రముఖులు శ్రీ డాక్టరు గారికి వీడ్కోలు సన్మానములు గావించునప్పుడు ఆహ్వాన సంఘాధ్యక్షుడు వీడ్కోలు వినతి పత్రిక నర్పించును.

### వీడ్కోలు వినతి పత్రిక

పౌర మహాశయులారా! నేడు మనము మన పట్టణా ప్రభుత్వ ఔషధశాలయందు సుమారు మూడు సంవత్సర ములనుండి పనిచేయుచు, పురములోగల ప్రజలను, ఆబాల గోపాలమును తమ యాదరణలచేతను, అమృత హస్తముల చేతను ప్రజల జాడ్యములనుఁ భాధలను నివారితములగావించి నేడు...పట్నమునకు బదిలీకాబడి రెండు మూడు రోజులలో సకుటుంబముగ నీనగరమును వీడి వెడలనున్నారు కావున వారియందు మనకుగల యాదరాభిమానములకు దార్కాణా ముగ ఈ వినతి పత్రమును వారికి మీయందఱి తరఫున నందు జేయుచున్నాను. ఈవినతి పత్రమును జదివి వినపించెద. దీనిని

సావధానముగా విని యనుమతింతురేని వెంటనే మన మిత్రులగు శ్రీడాక్టరు గారికి దాని నందజేసెదను.

భిషగ్వర మహాశయా! మీకిదె మానమస్కృతులు. తమరు మా పట్నమున కరుదెంచి సుమారు మూడు సంవత్సరములైనది. ఈ మూడువత్సరములు, మూడు నెలలు, కాదు కాదు, మూడు గంటలుగ గడచి పోయినవి. మీ వాత్సల్యము మందిరముల దిరుగు మహాభోగికిని, పట్టి పాకయందు మంచమునైన లేక నేలమీదనే పరుండి తమ రిచ్చిన ఔషధముల సేవించు బీదవానికి నొక్కవిధముననే యనుభవయోగ్యమైనది. మీ చిరునగవులు, ధైర్యము గొలుపు మాటలు, మీచేతి చలువ రోగుల కమృతప్రాయ ములగు ఔషధములై వారి జాడ్యములను చాలవఱకు మాన్పగలిగినవి. మీ యోర్పునకు, మీ నేర్పునకు, మీ సాధన సంపత్తికి వైద్యశాస్త్ర వైజ్ఞానిక ప్రతిపత్తికి మా జోహారులు. మా యౌషధశాల నలంకరించు యభి వృద్ధియు వీనికిదగు తార్కాణము. పెక్కు గ్రామముల నుండి రోగులువచ్చి వివిధశస్త్ర చికిత్సల బాధల నివారింప జేసికొని వెడలుచుండుట మీ మానవసేవా పరాయణత్వ మును ప్రకటించును.

చేత కాసైనలేని పేదవా డర్ధరాత్రంబున దనయింట బాధపడువారల బాధల నివారింపుడని మిమ్ము ప్రార్థింప నిద్రనుండిలేచి విసుగుదల నొకించుకేని గనపఱచక,

చిఱునగవున వెడలి, వారి బాధల మాన్పి, వారి కృతజ్ఞతా సూచకములగు విశాల దృక్కులే వారిచ్చు కానుకలుగ వారి భక్తి పూర్వకపు టంజలులే వారిచ్చు ఆశీస్సులుగ భావించి నిర్మల హృదయములై నిష్కామ కర్మ నొనర్చు యోగ్యుండవు నిన్నెట్లు మఱచువారము.

మహాశయా ! మాయౌషధశాలయందు మీ యుత్సాహ ఫలితముగ నిర్మింపబడిన నూతన చికిత్సా మందిరము, రోగుల విడిది మందిరము మీ పేరు నిచ్చుట చిరస్థాయిగ నొనర్చి సతతము మిమ్ము మాకు జ్ఞాపకమునకు దెచ్చు అనురాగ చిహ్నములు. మీ వియోగమున మా హృదయకమలము లొకించుక ముకుళితములైనను, మీ రిచ్చటనుండి పెద్ద యుద్యోగముపై పెద్ద నగరమున మానవ సేవ యొనర్ప నేగుకతన మాయా మోదమును భక్తివా త్సల్యములను ఆనందాశ్రుల రూపమున ప్రదర్శింపు చున్నాము. మమ్ముల నెప్పుడును మఱువవలదని గోరుచు మీకు పరమేశ్వరు డాయురారోగ్యైశ్వర్యముల నిచ్చుగాక యని ప్రార్థనల నొనర్చుచు ఈ వీడ్కోలు వినతి పత్రము నర్పించువారము. కైకొన ప్రార్థితులు. ఇక సెలవు (హర్ష ధ్వనులు).

7. పౌరస్వత్వ హక్కులకొఱకు ప్రభుత్వమునకు మహజరు.

తాలూకా, మాండలికాధికారుల ద్వారా...పట్టణ పౌరులు రాష్ట్రీయ ప్రభుత్వమువారికి పంపుకొను మహజరు విన్నపములు.

మహాశయులారా!

మా పట్టణము నేడు పౌరస్వత్వ సౌకర్యములేవియు లేక, అన్ని విధముల వెనుకబడియుండుటచే నభివృద్ధిగాంచ లేక మా దౌర్భాగ్యస్థితిని వెల్లడి చేయుచున్నది. ముప్పది వేలమందిగల యీ పట్టణమున పౌరులను దిలకింతుమా? నూటికెనుబదిమందికి గొంచెముపైగా నిరక్షరాస్యులు. జీవ యాత్ర నడుపు విధానము నెఱిగిన వారయ్యు లోకజ్ఞాన మున పూజ్యులు. పట్నమున నొకయున్నత పాఠశాల గలదుగాని దానియభివృద్ధికై యిటు పౌరులు గాని అటు ప్రభుత్వమువారుగాని యుదాసీనభావమును బ్రకటించుచు సహాయపడకుండుటయు మాదురదృష్టమే! వేయిమందికి తక్కువగాకుండ నుండవలసిన విద్యార్థులకు మారుగ ఈ పాఠశాలయందైదువందలు మాత్రమే విద్యార్థులుండుట ప్రజలకు విద్యయందుగల యాదరాభిమానములను వ్యక్త బఱుపగలదు.

పౌరుల విద్యాజ్ఞానముల నటుంచి వారి జీవన విధానము
లను గమనింతుమా వీరాదిమనివాసులతో లెక్కింపదగిన
వారుగాని యిరువదవశతాబ్ద నాగరికతకర్హులుగారని తెలియు
గలదు. వీథులు విశాలములుగావు. గృహనిర్మాణము నొక
పద్ధతి ననుసరింపలేదు. బాటలప్రక్క కాలువలు చెత్త
తోడను చెడునీటితోడను, గూడి దుర్గంధభూయిష్ఠములుగా
నున్నవి. ప్రతిదినము వీని పారిశుధ్యమునకై యేర్పాటు
జరుగలేదు. త్రాగునీటిని సరఫరాచేయు మాపట్టణములోని
చెఱువులు నిర్మలనీటి జలాశయములుగావు. వానికితగిన
రక్షణలేకుండుటచే అజ్ఞానులగు పౌరులు వానియందు
స్నానములనుచేసి వానిని పాడొనరించుచున్నారు. గృహ
పారిశుధ్యము, పరిసర పారిశుధ్యము, బాటలపారిశుధ్యము
పానజలపారిశుధ్యము ప్రథమములగు పౌరస్వత్వము నల
వఱచు ప్రాథమిక సూత్రములు. వీనిని నేర్పుటకై మా
పట్టణమున నొక పౌరస్వత్వబోధన కేంద్రము నేర్పరచిరి
గాని ఉన్నత పాఠశాలయందుగల కేంద్రము దీనికై గొంత
యుపయోగపడు యేర్పాటులను గావింపగోరెదము.

మా పట్టణాభివృద్ధికై ప్రభుత్వమువారాదర్శ
పూర్వకముగు నొకవయోజన పాఠశాల, ఉచితపుస్తక
భాండాగారము మంచి రేడియో యంత్రము, ప్రజలలో
పౌరస్వత్వ నిర్వహణము, విజ్ఞాన బోధల కుపయోగపడు
సినిమా ప్రదర్శనములను యువకుల శరీరవ్యాయామాభి

వృద్ధికై వారి కుపయోగపడు బహిరంగములగు ఆట స్థలములను స్థాపించవలసియున్నది.

ఉన్నతపాఠశాలను పౌరస్వాతంత్ర్యశిక్షణ కేంద్రముగాను, విజ్ఞాన కేంద్రముగాను నుండు రీతి దానికివలయు సౌకర్యములను ప్రభుత్వమువా రేర్పాటు చేయవలసియున్నది. పౌరులయారోగ్యాభివృద్ధికై పట్టణ పారిశుధ్యమునకై దగు ఏర్పాటులు, త్రాగునీటిని రక్షణ విధాన మార్గములననుసరించి కొళాయిల మూలమున ప్రజలకందజేయు ఏర్పాటులను ప్రభుత్వమువారామోదింపవలసి యున్నది.

ఇట్లు,

పట్టణము... }
తేదీ...... }

...పట్టణ పౌరులతరఫున,
సాంఘిక సేవాసమితి కార్యదర్శి.

## 8. గ్రామపునర్నిర్మాణ కార్యక్రమము సాగించుటకై పౌరసభవారు అధికార, అనధికార సహకారముల నపేక్షించు మహజరు

మద్రాస్ ఆంధ్ర పత్రిక

సంపాదకునకు — లేఖ

అయ్యా!

గ్రామసేవయే స్వతంత్రభారత రాష్ట్రసేవ, గ్రామ సౌభాగ్యమే భారతదేశీయ సౌభాగ్యము, భారతజాతి గౌరవ ప్రతిష్ఠలను నిలిపి, ప్రాచీనదేశీయ వైభవమును కీర్తిని ను మడింపజేయగలుగు సాధనమే గ్రామపునర్నిర్మాణ కార్యక్రమము. ఈ కార్యక్రమమున సాంఘిక, ఆర్థిక, నైతిక, వైజ్ఞానిక విషయములందు గ్రామస్థుల యభివృద్ధికి దోడ్పడుటకు విధానములు సూచింపబడుచున్నవి.

సాంఘికముగ వీరియభివృద్ధికి దోడ్పడునవి పారిశుధ్యము, విద్య, వైద్యసహాయము, పౌరస్వత్వ నిర్వహణా సౌకర్యములు - గ్రామమున గృహనిర్మాణమొక నియమిత పద్ధతిపై జరిగి విశాలములగు బాటలు, మురికినీటి కాలువుల పారిశుధ్యము, మంచి పానజల సరఫరా విధానము నుండవలసి యున్నది. స్థానిక యూనియను సంఘమునకు దగు ధన సహాయమొనర్చి వీనిని సాధింప ప్రభుత్వాధికారులును,

పుర ప్రముఖులగు వర్తకులు, భూస్వాములు, మొదలగు అనధి కారులుకూడ తోడ్పడ ప్రార్థితులు.

వైద్యసహాయమునకై గ్రామమున నుచితముగ నౌషధముల నిచ్చు ఔషధశాల, ఒక పశువైద్యశాల, ఒక శిశుపోషణ కేంద్రమునుండవలయు. మఱియు గ్రామమున నిర్బంధ ప్రాథమిక విద్యనొసగు ప్రాథమిక పాఠశాలయొకటి వార్థావిధానమున స్థాపింపబడవలసియున్నది. వయోజనులలో నూటి కెనుబదిమంది నిరక్షరాస్యులగుటచే వారికి చదువు, వ్రాత లోకజ్ఞానము బోధించుట కొక వయోజన విద్యానిలయము స్థాపితము కావలయును. ఇందును, ప్రాథమిక పాఠశాలయందునుగూడ విద్యాబోధన అధునికదృశ్య-శ్రవణ పూర్వకవిధానముల నవలంబించు విధానము ననుసరించవలెను. ఈ విధానమునకై గ్రామ రేడియో యంత్రము, గ్రామ సినీమాయంత్రము కావలసియున్నవి.

ఇక గ్రామముయొక్క ఆర్థికాభివృద్ధికి వలయు సాధనముల గనిపెట్టవలసియున్నది. గ్రామస్థుల ప్రధాన వృత్తి వ్యవసాయమగుటవలన దానియభివృద్ధికై ప్రభుత్వము వారు కర్షకులకు నీటి సరఫరా సౌకర్యములను కలుగజేసి, మంచి విత్తనములను, ఎరువులనిచ్చుచుండవలెను. చెంతగల నది జీవనదిగాకుండుటచే దాని కడ్డుగ ఆనకట్టకట్టి నీటిని పూన్చి దానిని పంటభూములకు కాలువల వెంబడి పంపవలయును. నదీజల మందుబాటులో లేని భూములకు

ప్రభుత్వ ధనసహాయమున ద్రవ్యబలము నూతులనుండి నీరంద వలయును. వ్యవసాయదారులకు తీరుబడి సమయములలో నొక యుపవృత్తిగా నూలువడకుట, మగ్గములపై బట్టల నేత నేర్పవలయును. చెఱకుతోటలున్న బెల్లము తయారు చేయుట ప్రబలగలదు.

ఈ రీతిగ గ్రామపునర్నిర్మాణమున ప్రజలు, అధికార అనధికారుల సహకారముతో బనిచేసిన మంచి లాభములు కలుగుననుటకు సందియము లేదు.

సంపాదక మహాశయా ఈ విజ్ఞప్తిని తమ దైనిక పత్రికయందు ముద్రింపించి ప్రచురింప గోరుచున్నాను.

ఇట్లు,

......................సంతకం

గ్రామపునర్నిర్మాణ సంఘ కార్యదర్శి.

---

Renaissance Printers Limited, Madras-17.